# ఆంధ్రపత్రిక



31/9/510

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 44. సంచిక 61 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 2-6-1957 Reg. No. M. 5745 10 పేజీలు 13 నయాపైసలు

# స్వాతంత్ర్యోద్యమంనాటి 'చేవ' ఏర్పడితేనే కాంగ్రెసుకు మనుగడ

## ప్రజలకష్టాలుగమనించడానికి ప్రత్యేక ఏర్పాటుకు ఆలోచన

### అఖిలభారత కాంగ్రెస్ సంఘంలో అధ్యక్షుడు ధేబర్ సూచన

### పరోక్ష ఎన్నికలతో, సంస్థ నిర్మాణ సవరణల ప్రతిపాదన

న్యూఢిల్లీ, జూన్ 1: ప్రజల కష్టాలను గమనించడానికి ప్రత్యేకమైన ఏర్పాటు ఏదైనా చేసి, తద్వారా కాంగ్రెస్ సంస్థను బలపరిచి, దేశంలో కృషిపట్ల శ్రద్ధ, చైతన్యం కలుగ చేయాలని, కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ధేబర్ అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశాన్ని ప్రారంభించేస్తూ సూచన చేశారు.

కాంగ్రెస్ సంఘాలకు పరోక్షపు ఎన్నికలు, సమర్థ సభ్యత్వానికి కొత్త నిర్వచన మొదలైన ముఖ్య కాంగ్రెస్ సంస్థ నిర్మాణ సవరణలను కేంద్ర కార్యవర్గం చర్చించి నిర్ణయించినవానిని, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి చర్చను ప్రతిపాదించారు.

కాన్‌స్టిట్యూషన్ క్లబ్‌లో జరుగు తున్న ప్రస్తుతసభ, ఇవాళ సమావేశంలో వసంతిక వాతావరణం స్పుటంగా కనపడింది. వేదిక పూరిగుడిసె మాదిరిగా అలంకృతమయింది.

వేదికపై అధ్యక్షుడు శ్రీ ధేబర్ కాక ప్రధాని శ్రీ నెహ్రూ, శ్రీ గోవింద వల్లభపంత్, మౌలానా ఆజాద్, డా॥ కట్జూ మొదలైనవారు ఆసీనులైనారు.

### స్వర్గస్థులైన నాయకులకు జోహార్లు

ప్రముఖ కాంగ్రెస్ నాయకులు టంగుటూరి ప్రకాశం (ఆంధ్ర), బి. జి. ఖేర్ (బొంబాయి), శ్యామనందన్ సహాయ (బీహార్), వారగోవిందపంత్ (ఉత్తరప్రదేశ్), తారకదాస్ బెనర్జీ (ప. బెంగాల్), క్షితీశచంద్రఘోష్ (ప. బెంగాల్), అండి గౌండర్ (తమిళనాడు), సర్దార్ సింహారాణా (గుజరాత్), కె. రాఘవన్‌పిళ్ళై (కేరళ), కపిలదేవ్ అగర్వాల్ (రాజస్థాన్) బాలాహారికచంద్ర (రాజస్థాన్) గార్ల స్మృతికి సంతాపం ప్రకటిస్తూ, సభా ప్రారంభంలో అఖిలభారత కాంగ్రెస్ సంఘం ఒక తీర్మానం చేసింది. మృతుల పట్ల గౌరవచిహ్నంగా సభ్యులందరూ లేచినిలిచి క్షణం మౌనం వహించారు.

### కాంగ్రెస్ కార్యక్రమాన్ని ప్రజలు ఆమోదించారు

సభను ప్రారంభిస్తూ, అధ్యక్షులు శ్రీ ధేబర్, కాంగ్రెస్ పరిపాలనా విధానాలను, నిర్మాణ కార్యక్రమాలను ప్రజలు హృదయపూర్వకంగా ఆమోదించినట్లు ఎన్నికలు స్పష్టపరిచినవన్నారు. దీనివల్ల కాంగ్రెసువాదులపై భారం మరింత పెరిగింది, సామ్యవాద సమాజలక్ష్యానికి దేశాన్ని చేర్చవలసిన బాధ్యత కాంగ్రెస్‌పై పడింది. అందువల్ల ఈ బాధ్యతను, ఆ కర్తవ్యపాలనకు సాధన మార్గాలను తీర్చిదిద్దడానికి అఖిలభారత కాంగ్రెస్ సంఘం సమావేశమయింది, అని శ్రీ ధేబర్ అన్నారు.

ఇదిగాక కాంగ్రెసు సంస్థకు సంబంధించి నిర్మాణ సమస్యలు, ఇతర సమస్యలుకూడా పరిశీలించవలసినవి ఉన్నాయన్నారు.

ఇండోర్ సమావేశంలో ఎన్నికల ప్రణాళికను కాంగ్రెసు ప్రజలసమక్షంలో పెట్టింది. అప్పుడు కాంగ్రెసు ప్రాథమిక పరిపాలనాంశాలను, లక్ష్యాలనూ స్పష్టంగా వివరించింది. తరువాత ద్వితీయ పంచవర్ష ప్రణాళిక స్థూలస్వరూపాన్ని ప్రజలకు కాంగ్రెస్ తెలియపరిచింది.

దేశం యావత్తూ కాంగ్రెసు ప్రతిపాదించిన కార్యక్రమాలను పరిపాలనా విధానాలను ఆమోదించిందని, శ్రీ ధేబర్ సంతోషం ప్రకటించారు. అక్కడక్కడ ఒకటి రెండుచోట్ల తప్ప రాష్ట్రాలన్నిటిలోనూ కాంగ్రెస్ గెలిచింది. గెలవని రాష్ట్రాలలో కూడా కాంగ్రెసు మూలబలాన్ని నిలుపుకుంది, లోక్‌సభలో కాంగ్రెసుబలం మరింత పెరిగింది, అన్నారు.

ఎన్నికలలో కాంగ్రెసు గెలిచినా, ఈ సంస్థలో దౌర్బల్యాలు కొన్ని ఉండిపోయాయి. అయితే ఇదేమంత భయపడవలసినదీ, బెంగపెట్టుకోవలసినదీ కాదన్నారు. బలం ఎక్కడుంటే అక్కడ ఆ బలాన్ని సుస్థిరపరచుకోవాలి. దౌర్బల్యం ఉన్నచోట అది తొలగించివేయాలి.

కాంగ్రెస్‌వాది అయినవాడు, తాను పెట్టుకొన్న లక్ష్యాన్ని ఎన్నడూ విస్మరించరాదు, అని శ్రీ ధేబర్ హెచ్చరించారు. ఎన్నికల సమయంలో కాంగ్రెస్ ప్రాథమిక సభ్యులుకూడా కానివారు లక్షలాది ప్రజలు కాంగ్రెసుకు తోడ్పడ్డారు.

ఎన్నికలు కాంగ్రెస్‌ను బలపరిచాయి

కూడా. ప్రజలకు ఇంకా కాంగ్రెస్‌లో విశ్వాసం ఉన్నదనీ, కాంగ్రెస్‌ను ఇంకా అనుసరించడానికి సిద్ధంగా ఉన్నారనీ ఎన్నికలు రుజువుచేశాయి దీనితో కాంగ్రెస్‌వాదుల బాధ్యతలు భారతరమైనాయి. కాంగ్రెస్‌కు అధికారం లభించడంతో తిరిగి ప్రజలకు సేవచెయ్యడానికి అనుకొన్న కార్యక్రమాలు అమలు జరపడానికి అవకాశం లభించింది.

ఈ బాధ్యతలను సక్రమంగా సమర్థంగా ఎలా నిర్వహించాలి అనే విషయాన్ని కాంగ్రెస్ కేంద్ర కార్యవర్గం రెండు స్మరణాలుగా ఆలోచిస్తున్నది.

కాంగ్రెస్ బలహీనపడిందనడం పొరపాటు. బలమే లేకపోతే ప్రతిపక్షాల నెదిరించి ఎలా నిలవగలిగేది? కాంగ్రెస్‌కు ప్రజాకోటివల్ల బలం లభించింది. ఈ బలాన్ని సుస్థిరపరచుకోటానికి, సంస్థకు అపకారమైన లక్షణాలను నివారించడానికి ఆలోచన జరిగింది.

మార్పులు అన్ని దశలలోనూ కాంగ్రెస్‌ను బలపరచాలనే ఉద్దేశంతో తలపెట్టినవే.

ప్రజలకు ఆయా ప్రాంతాలలో ప్రత్యేకపు ఇబ్బందు లున్నమాట నిజం. అవి అల్పమైనవే కావచ్చు, కాని పేద ప్రజలకు అవే పెద్దవి. వానిని తృప్తికరంగా పరిష్కరించకపోతే వాతావరణం కాంగ్రెసుకు సుముఖంగా ఉండదు.

ప్రజల ఈ కష్టాలను గమనించడానికి ఒక ప్రత్యేక ఏర్పాటు చెయ్యవలసిన విషయాన్ని ఆలోచించాలి. ఆవిధంగా కాంగ్రెస్‌ను పునాదినుంచీ బలపరచవచ్చును. కాంగ్రెసును సజీవమైన సంస్థగా, ప్రజలలో కృషి చైతన్యాలకు దోహదమిచ్చేదిగా మార్చవచ్చును.

గ్రామీణార్థిక వ్యవస్థపైనే మన అభివృద్ధి ప్రణాళికలన్నీ ఆధారపడి ఉంటాయి. కాబట్టి, ఆహారసామగ్రి ఉత్పత్తి వృద్ధికావడం చాలా ముఖ్యమని శ్రీ ధేబర్ అన్నారు.

బడ్జెట్ ప్రకటితమైన తరువాత కాంగ్రెసు వాదులలో కూడా పన్నులు భారంగా ఉన్నట్లు అసంతృప్తి కనపడుతోంది. కాని మన లక్ష్యం ఏమిటో నిర్ణయించుకొని, అది ఎలా సాధించాలో గమనించడం అవసరం. ఆ లక్ష్యాన్ని శీఘ్రంగా సాధించాలంటే, కొంత బరువు మోయకతప్పదు. ఇంక ఈ బరువు ఎవరికి ఎలా పంచాలనేదే సమస్య.

### సంస్థనిర్మాణ సవరణలు

శ్రీ ధేబర్ ప్రసంగం అనంతరం, కాంగ్రెస్ సంస్థసంస్కరణలనుగురించి ఒక పత్రం సమర్పించారు.

ఇందులో ముఖ్యంగా తలపెట్టిన మార్పులు రెండు. 1. పరోక్షపు ఎన్నికల ఏర్పాటు 2. భిన్న కార్యక్రమాలలో పాల్గొనేవారికి కాంగ్రెస్ సంఘాలలో ప్రాతినిధ్యం ఇవ్వడం.

ఈ మార్పులను కేంద్ర కాంగ్రెస్ కార్యవర్గం, రాష్ట్ర కాంగ్రెస్‌ల అధ్యక్ష కార్యదర్శుల సమావేశం పరిశీలించాయి.

ముఖ్యాంశాలను సూత్రప్రాయంగా అఖిలభారత కాంగ్రెస్ సంఘం ఇప్పుడు ఆమోదిస్తే, దీన్నిబట్టి ఉత్తరోత్తరా మరో సమావేశంలో తీర్మానం రూపంలో ఇది ప్రతిపాదిస్తారు.

కాంగ్రెస్ కార్యవర్గం ఈ అంశాలను పరిశీలించి ఒక తీర్మానంచేసివుంది.

(3 వ పుట చూడుడు)

## వ్యవసాయ రంగంలో సహకార ఉద్యమం

### అభివృద్ధి కృషిపై సలహాలకు జాతీయ మండలి ఏర్పాటు

న్యూఢిల్లీ, మే 31: వ్యవసాయ రంగంలోనూ, ముఖ్యంగా వ్యవసాయ పరపతి విషయంలోనూ అనుసరిస్తూ సహకార విధానాలను సమీకరించడానికి, ఒక జాతీయ సలహా మండలిని ఏర్పాటుచేయాలని భారత ప్రభుత్వం నిశ్చయించింది. సహకార ఉద్యమాభివృద్ధికి సంబంధించిన విషయాలపై యీ మండలి, కేంద్రప్రభుత్వ ఆహార వ్యవసాయ శాఖకు, రిజర్వుబ్యాంకుకు సలహా లిస్తుంది.

78 మందితో ఈ మండలి ఏర్పడుతుంది. జాతీయ సహకారోద్యమ ప్రతినిధులు గిడ్డంగుల మండలి ప్రతినిధులు, కేంద్ర గిడ్డంగుల కార్పొరేషన్ ప్రతినిధులు, రిజర్వుబ్యాంకు స్టేట్ బ్యాంకుల ప్రతినిధులు, పార్లమెంటు సభ్యులు, సంఘసేవకులు, ఆర్థిక శాస్త్రవేత్తలు, సహకారోద్యమ కార్యకర్తలు యిందులో సభ్యులుగా ఉంటారు.

ఇటువంటి సలహామండలిని ఏర్పాటు చేయాలి, గ్రామీణ పరపతి సౌకర్యాల దర్యాప్తుసంఘం యిదివరకే శిఫార్సు చేసింది.

### సహకార సేద్యం

#### ముస్సోరి సమావేశం శిఫార్సులు అమలు

న్యూఢిల్లీ, మే 31: "దేశంలో సహకార సేద్యాన్ని ప్రోత్సహించాలని, ముస్సోరి సమావేశంలో, వివిధ రాష్ట్రాల అభివృద్ధిశాఖల కమీషనర్లు చేసిన శిఫార్సులను, అమలుజరపడానికి ప్రభుత్వం చర్య తీసుకొంటున్నది" అని సమాజ వికాస కార్యక్రమాల మంత్రి శ్రీ ఎస్. కె. డే యివాళ లోక్‌సభలో చెప్పారు.

ముస్సోరి సమావేశం శిఫార్సులను, కేంద్ర మంత్రులకు, రాష్ట్ర ప్రభుత్వాలకు పంపించారని కూడా శ్రీ డే చెప్పారు.

ఆహారశాఖమంత్రి శ్రీ ఎం. వి. కృష్ణప్ప ఫిరోజ్ గాంధి ప్రశ్నకు జవాబు చెబుతూ, దేశంలో 14 లేక 15 వందల సహకార వ్యవసాయ క్షేత్రాలున్నాయని తెలియజేశారు.

### సహకారోద్యమవ్యాప్తి

#### జనాభాలో 22.8% స్థానం

న్యూఢిల్లీ, మే 31: దేశ జనాభాలో నూటికి 22.8 మంది దాకా సహకారోద్యమ రంగంలో ఉన్నదని, కేంద్ర ప్రభుత్వ సహకారశాఖ మంత్రి డా॥ పంజాబ్‌రావు దేశ్‌ముఖ్ చెప్పారు.

డా॥ దేశ్‌ముఖ్ సహకార ఉద్యమ పత్రికల సంపాదకుల సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ, భారత దేశంలో 2 లక్షల 40 వేల సహకార సంఘా లున్నవని వీటి సభ్యత్వం 175 లక్షల పైగా ఉంటుందని ఒక్కొక్క కుటుంబంలో సగటున ఐదుగురున్నట్లు లెక్క కడితే, యీ ఉద్యమంలో 8 కోట్లు 60 లక్షల మందికి ప్రాతినిధ్యం ఉన్నట్లు తేలుతుందని వివరించారు.

ఇప్పటి ఆర్థిక వ్యవస్థలో, శాంతియుతమైన విప్లవం సాధించడంలో సహకారం ఎంత ముఖ్యమైన భూమిక నిర్వహించేదీ ప్రభుత్వానికి తెలుసని, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో, సహకారోద్యమ అభివృద్ధికి రు 75 కోట్లు కేటాయించడమైందని డా॥ దేశ్‌ముఖ్ చెప్పారు. రానున్న కొద్ది సంవత్సరాలలో సహకారఉద్యమం త్వరవేగంతో అభివృద్ధి చెందుతుందని యీ కార్యక్రమంలో సహకార పత్రికల సంపాదకులు ప్రధానమైన పాత్ర నిర్వహించాల్సి ఉంటుందని మంత్రి హెచ్చరించారు

### ఫ్యాక్టరీల ప్రధాన తనిఖీదారు కార్యాలయం

కర్నూలు, జూన్ 1: ఫ్యాక్టరీలూ బాయిలర్ల ప్రధాన తనిఖీదారు కార్యాలయాన్ని ఇక్కడ ఇవాల్టినుంచీ మూసివేశారు. హైదరాబాదులో ఈ నెల 3 న తేదీన ఈ కార్యాలయాన్ని తిరిగి తెరుస్తారు.

### కాఫీ, టీలపై ఎక్సైజు సుంకాలు

#### హెచ్చింపు రద్దుచేస్తూ ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, మే 31: కాఫీ, టీలపై యిటీవల హెచ్చించిన ఎక్సైజుసుంకాలను ప్రభుత్వం విరమించింది. వీటిపై ఎక్సైజు సుంకాలు పూర్వం ఎలా ఉన్నాయో, జూన్ 1 నుంచి అలాగే ఉంటాయని, యివాళ అసాధారణ గెజెట్‌లో అధికార ప్రకటన వెలువడింది.

## కులమత రాష్ట్ర దురభిమానాలు పెరిగాయని నెహ్రూ ఆవేదన

### "మండల సంఘాలు పునాదిగా సంస్థ పునర్నిర్మాణం"

న్యూఢిల్లీ, జూన్ 1: "దేశంలో కాంగ్రెసుకు పటుత్వం లేదని మొన్నటి ఎన్నికలు ఋజువుచేశాయి. యథార్థం చెప్పాలంటే, చాలాచోట్ల కాంగ్రెసుకు అసలు ఆకారమే లేదు. కాంగ్రెసువాదులలో రాష్ట్రీయ దురభిమానం, కులమతతత్వం అధికమయ్యాయి. ప్రజలతో వీరు సంబంధం లేకుండా ఉన్నారు. కాంగ్రెసువాదిలోని సంకుచిత దురభిమానాలవల్ల మన పరువు గంగపాలు ఔతుంది; మనం అంతా ఎంతో సిగ్గుపడవలసి వస్తుంది. ఈదౌర్బల్యాల నన్నిటినీ ఎదుర్కొని, స్వాతంత్ర్యోద్యమంనాటిసంస్థగా కాంగ్రెసు వెలుగొందాలి. ఇందుకు అవసరమైతే పార్టీ రాజ్యాంగాన్ని మార్చుకోవాలి" అని అఖిలభారత కాంగ్రెసు సమావేశాన్ని నేడు ప్రారంభిస్తూ, ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ హెచ్చరించారు.

ప్రజలతో సన్నిహిత సంబంధం ఏర్పాటుచేసికొనడం ప్రదేశ్ సంఘాలకు కుదరదనీ, అందువల్ల మండల సంఘాలే కాంగ్రెసుపార్టీకి పునాది కావాలనీ కూడా ఆయన పేర్కొన్నారు.

పార్టీ నియమావళికి కాంగ్రెసు కార్యవర్గం ప్రతిపాదించిన సవరణలపై మాట్లాడుతూ శ్రీ నెహ్రూ కాంగ్రెసు వాదుల చర్యలను, మనస్తత్వాలను నిశితంగా విమర్శించారు.

"పూర్వం మహాంతుల మాదిరిగా కాంగ్రెసు గద్దెనాపంటే కొందరి సొంతమే ఔతోంది. క్రొత్తగా వచ్చే వారికి అవకాశం లేకుండా చేయడం, ఒకవేళ ఎవరైనా వచ్చినా, వారికి చేయవలసిన పని ఏమీ లేకపోవడం జరుగుతోంది. కాంగ్రెసు వాదులలో రాష్ట్ర, కులమత దురభిమానాలు అధికమయ్యాయి. ఈ దౌర్బల్యాల నన్నిటినీ అధిగమించి స్వాతంత్ర్యోద్యమంనాటి సంస్థగా తిరిగి కాంగ్రెసు రూపొందాలి. నేను కాంగ్రెసు సంస్థను చూసి ఎంతో గర్విస్తున్నాను. నిన్నటి కాంగ్రెసును మాత్రమే కాదు, నేటి కాంగ్రెసును చూసి కూడా గర్విస్తున్నా. ఈ సంస్థను నేను విమర్శిస్తున్నాను. మీరు విమర్శిస్తున్నారు. ఇలా విమర్శ వాస్తవంగా ఉండడం అంతర్గత అభివృద్ధికి చిహ్నం. ఇందువల్ల మనలోని లోపాలను సరిదిద్దుకొనడానికి ప్రయత్నించే అవకాశం వుంది. మన కెదురయ్యే చిక్కులను పరిష్కరించుకోవచ్చు. మనలోని తప్పులను, లోపాలను సరిచేసుకోవచ్చు. మనలోని లోపాలను కాంగ్రెసు సంస్థకోసం సరిచేసికోవలసి ఉంటే కాని అకస్మాత్తుగా కలిగే నిరాశావాదంవల్ల కాదు. కాంగ్రెసు వంటి చారిత్రిక సంస్థ మనుగడకే ఇది ముఖ్యం. కాంగ్రెసు చరిత్రను రూపొందించింది. భవిష్యత్తులో కూడా చరిత్రను రూపొందిస్తుంది. ఐతే, ప్రపంచంలో కలిగే మార్పుల కనుగుణంగా తన సిద్ధాంతాలను ఆలోచనను మార్చుకోవాలి. అప్పుడే అదిసాధ్యం."

"చరిత్రలో ఒకప్పుడు ఎంతో సమర్థంగా పని చేసిన ఒక సంస్థ మరో సమయంలో అలా వ్యవహరించడానికి వీలులేక పోవచ్చు. ఈచిక్కు ఒక్క కాంగ్రెసే కాదు; దేశంలోని చిన్న పక్షాలు సైతం ఎదుర్కొనవలసి ఉంది.

(8 వ పుట చూడుడు)

## శ్రీ బృహత్స్తోత్రరత్నాకరం

దేవతలు, ఋషులు, మహనీయులుచేసిన 264 పుణ్యస్తోత్రములు. కామ్యదాయకములు. వినాయక 5, మహావిష్ణు 70, శివ 68, శ్రీరామ 24, గంగాదితీర్థ 20, శ్రీదేవి 27, నవగ్రహ 36, వేదాంత 11. పేజీలు 564 రు. 6-0-0 పోస్టేజి 1-4-0.

* మంత్ర రత్నాకరము *

దేవతల మూలమంత్రములు 271, ధ్యానచిత్రాలు 85, యంత్రములు 88, కఠిన విషయ వ్యాఖ్య, యంత్రోద్ధారము, దేవపూజ, నిత్యార్చన, మంత్రపద్ధతి, షట్కర్మనిరూపణాదులు. పాఠకూర్పు. ధర రు. 12-0-0 పోస్టేజి రు. 1-8-0.

*శాంతి కమలాకరము*

శాస్త్రోక్త సమస్త దుష్టారిష్ట శాంతివిధానాలు విపులము. ధరరు. 8, పోస్టేజి 1-6-0

M. G. Subbaraya Sastri & Sons, 18, Krishna Agraharam, Madras-1

శ్రీ సుబ్బరాయ అండ్ నారాయణ కాలేజి
నరసారావుపేట.

కాలేజి 19-6-57 న తెరువబడును. ప్రవేశములు 15-6-57 నుండి జరుగును. ఈదిగువ కోర్సులు కాలేజిలో చదువవచ్చును.

(1) ప్రీ—యూనివర్సిటి కోర్సు (ఆర్ట్సు & సైన్సు)
పార్టు III లో
(2) బి. ఏ. డిగ్రీకోర్సు లెక్కలతో (ii) ఎకనామిక్సు (మైనర్) (iii) హిస్టరీ (మైనర్) మనియార్డరుద్వారాగాని, నగదుగాగాని రు, 1/- చెల్లించి దరఖాస్తు ఫారముకొరకు, ప్రాస్పెక్టసుకొరకు వ్రాయండి.

(సం) వి. రంగనాయకులు,
నరసరావుపేట. ప్రిన్సిపాల్.

శ్రీ చల్లపల్లి రాజేశ్వరీ సంస్కృత కళాశాల, మోదేకుఱ్ఱు, కొత్తపేట తాలూకా, తూర్పు గోదావరి.

పై కళాశాలకు ఒక తెలుగు పండితుడు కావలెను. యోగ్యతలను అనుభవమును తెలియజేయుచూ 10-6-57 తేదికి చేరునట్లు దరఖాస్తులు పంపవలెను.

కాపీలు తయారుగా వున్నాయ్
భయంకర డిటెక్టివ్ నవల.
"అగ్ని బరాటా"
రచన: ప్రకాష్ అరోర.
అందమైన త్రివర్ణముఖచిత్రంతో 0-8-0
ఏజంటులకు 22% కమీషను.
అరోరా పబ్లికేషన్సు—ముంజుకొండస్ట్రీట్
విజయనగరం.

భారత ప్రభుత్వము
మినిస్ట్రి ఆఫ్ ఫుడ్ & అగ్రికల్చర్
(ఆహార శాఖ)

టెండరు నోటీసు నం. 60 (2)-57 BP. II. డైరక్టర్ జనరల్ ఫుడ్, డిపార్టుమెంటు ఆఫ్ ఫుడ్, మినిస్ట్రి ఆఫ్ ఫుడ్ & అగ్రికల్చర్, మల్టీస్టోరీడ్ బిల్డింగు, క్వీన్ విక్టోరియా రోడ్, న్యూఢిల్లీవారు అమెరికానుండి దిగుమతి చేయబడిన ఈ దిగువరకపు బియ్యమును మూడుగా సాధారణ ముతకరకపు స్వదేశి బియ్యము సరఫరా చేయుటకు టెండర్లు కోరుచున్నారు:

1. మంచి పొడుగాటి గింజలు విరిగినవి 7% కంటె హెచ్చుకానివి. 2. మంచి పొడుగాటి గింజలు విరిగినవి 25% లోపు నను 7% పైననూ గలవి. 3. మధ్యరకపు గింజలు విరిగినవి 7% మించకుండ నున్నవి.

అమెరికా బియ్యము రకమునకు 500 టన్నులు చొప్పున బొంబాయిలోని కేంద్రప్రభుత్వ గోడౌనులనుండి ఇవ్వబడును. టెండరుదారులు వారుసరఫరా చేయబోవు స్వదేశి బియ్యపు పరిమాణము ననుసరించి మారకమునకు కోటేషను పంపవలెను. టెండరులు డైరక్టరు, జనరల్, ఫుడ్ వారికి 17-6-57 సా॥ 3గం. లోగా చేరవలెను. మారకపు షరతులు, నిబంధనలు గల సదరు ఫారములు (మార్పుకొనుటకు వీలుపడదు. సెట్టు 1కి రు. 2/- (వాపసుచేయబడదు) నగదుగాగాని, మనియార్డరు ద్వారాగాని (చెక్కులు, పోస్టలు ఆర్డర్లు అంగీకరింపబడవు) చెల్లించి, టెండరు నోటీసు నంబరు డబ్బు కట్టిన వారి పూర్తి పేరు, చిరునామాలు వ్రాసి 15-6-57 తేది మ॥ 1 గం॥ లోగా వారి ఆఫీసు నుండి లేక ఈ దిగువ వివరించిన ఆఫీసులలోగాని టెండరు ఫారములు పొందవచ్చును.

అమెరికా బియ్యం నమూనాలు, టెండరు ఫారములు ఈక్రింది ఆఫీసులలో లభించును:

1. డైరక్టర్ జనరల్ ఫుడ్, న్యూఢిల్లీ. 2. రీజియనల్ డైరెక్టర్ ఫుడ్, బొంబాయి. 3. రీజియనల్ డైరక్టర్ ఫుడ్, మద్రాసు. 4. రీజియనల్ డైరక్టర్ ఫుడ్, కలకతా. 5. రీజియనల్ డైరక్టర్ ఫుడ్, న్యూఢిల్లీ. 6. డెప్యూటీ డైరక్టర్ ఫుడ్, హైదరాబాద్. 7. డెప్యూటీ డైరక్టర్ ఫుడ్, కాన్పూరు. 8. అసిస్టెంటు డైరక్టరు ఫుడ్, నాగపూర్.

బియ్యములోని తెగలను, ఎక్కడ బియ్యం ఎలా వుంటాయో తెలియజెప్పుటకు మాత్రమే ప్రభుత్వము వారు నమూనాలను చూపదమైనది. నమూనాలతో సరిపోయిన బియ్యమును అందించుటకు ప్రభుత్వము ఎట్టి పూచీని తీసుకొనదు. టెండరు పంపదలచినవారు టెండరు పంపుటకు ముందు నిలువలను చూసుకొని బ్యాగ్గుల, వాటి స్థితిని, అవి వుండే కన్‌టైనర్లనుచూచి తృప్తిపడవలెను. DA-488 (2)

## అభివృద్ధి పనులపై శ్రద్ధవహించండి

### ప్రజలకు మంత్రి విజ్ఞప్తి

గుంటూరు, మే 28: "ప్రజాస్వామ్యమంటే ప్రజలపరిపాలన. కనుక ప్రజలు ముందుకువచ్చి అభివృద్ధిపనులను కొనసాగిస్తే ప్రభుత్వం కూడా వారిని అనుసరిస్తుంది." అని సత్తెనపల్లి తాలూకాలోని రాజుపాలెం, బెల్లంకొండ గ్రామాలలో జాతీయ వికాస కార్యక్రమ కేంద్రాలను ప్రారంభిస్తూ ఆర్థికశాఖ మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అన్నారు. అభివృద్ధి పనులపై ఇతోధిక శ్రద్ధవహించవలసినదిగా ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

రాజుపాలెంలో శాసనసభ్యుడు శ్రీ జి. రామస్వామిరెడ్డి పతాకోత్సవం జరిపారు. చేనేతవస్త్రాలూ, ఇతరవస్తుప్రదర్శనను శాసనసభ్యుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రారంభించారు. సభకు జిల్లాకలెక్టరు శ్రీ జె. పి. ఎల్. గ్విన్ అధ్యక్షత వహించారు. అభివృద్ధి పనులను జరిపించడంలో శ్రమదానం ద్వారా సైనాసరే అందరూ సహకరించాలని కలెక్టరు అన్నారు.

జాతీయవికాస కార్యక్రమాలు అనేవి ప్రజల కార్యక్రమాలు కనుక దారిద్ర్య నిర్మూలనకు కృతనిశ్చయులై ప్రజలు ఈ కార్యక్రమాలలో దీక్షగా పనిచెయ్యాలని ఆర్థికశాఖ మంత్రి విజ్ఞప్తి చేశారు.

ప్రజలు తమవంతు పనిని నెరవేర్చితేనే తప్ప అభ్యున్నతి సాధ్యంకాదని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అన్నారు. శ్రీయుతులు జి. రామస్వామిరెడ్డి, మంతెన వెంకటరాజు, నేతి వెంకటాచలపతిగారలు కూడా ప్రసంగించారు. జిల్లా ప్రణాళికల శాఖాధికారి శ్రీ ఎల్. మూలకొండయ్య వందనసమర్పణచేశారు.

అధికారులతో సహకరించి, వారి సలహాలతో కార్యక్రమాలను జయప్రదం చేయవలసినదిగా బెల్లంకొండ జాతీయ వికాసకేంద్రానికి ప్రారంభోత్సవంచేస్తూ ప్రజలకు ఆర్థికమంత్రి విజ్ఞప్తిచేశారు.

మాచాయపాలెంలో రోడ్డునిర్మాణం పనికి ఆర్థికమంత్రి ఉపక్రమణ చేయించారు. అభివృద్ధిపనులలో శ్రద్ధాశక్తులు చూపించవలసినదిగా ప్రజలకు కలెక్టరు విజ్ఞప్తిచేశారు.

ఈ కార్యక్రమాలద్వారా రోడ్లు, పాఠశాలలవంటి అవసర సౌకర్యాలను ఏర్పాటు చేయించుకోవలసినదిగా ప్రజలకు మంత్రి విజ్ఞప్తిచేశారు. ప్రజాహిత కార్యక్రమాలలో మహిళలు కూడా పాల్గొనేటట్లు ప్రోత్సహించి, వారికి రెండురోజులు ఉద్యానవనాన్ని, పరిశ్రమ మందిరాన్ని పూర్తిగా మహిళలకు వదలివేయవలసినదిగా సలహా చెప్పారు.

చండ్రరాజుపాలెంలో ప్రాథమిక పాఠశాల భవనానికి మంత్రి శంకుస్థాపనచేసి, గాంధీ శిలావిగ్రహాన్ని ఆవిష్కరించారు. సభకు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ బొనిగళ్ళ సత్యనారాయణ అధ్యక్షత వహించారు. గ్రామాలలోని ప్రజల స్థితిగతులను బాగుచేయడానికి అవిరళ కృషి చేయవలసినదిగా ప్రజలకు మంత్రి విజ్ఞప్తిచేశారు. మంత్రి గౌరవార్థం శ్రీ నాగిరెడ్డి విందుచేశారు.

ఆంధ్రా యూనివర్సిటీ
టెండర్లు కోరడమైనది.
నం. ఎ ఎ 1/11772/56
వాల్తేరు, 28—5—57.

సెప్టిక్ చెరువులకు బురదకాలువలను నిర్మించుటకుగాను రిజిస్ట్రారు, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు వారిచే 10-6-57 సోమవారం సా॥ 4 గం॥ వరకు టెండర్లు అందుకోబడును. ప్లాన్లు, స్పెసిఫికేషనులు రిజిస్ట్రారు గారికి దరఖాస్తుతోపాటు, వాటి ఖరీదు నిమిత్తమై రు 4/- చెల్లించి పొందవచ్చును.

జి. వి. ఎస్. ఎల్. నరసింహం,
అసిస్టెంటు రిజిస్ట్రార్,
(ఎక్కౌంట్సు).

వి. ఇ. డబ్ల్యు., జి. ఇ. సి. క్రాంప్టన్, ఉషా, ఓరియంట్, ఫోనిక్సు, కాన్సెల్స్, హిందూస్తాన్, మార్కొని, కె. డి. కె., ట్రాపికల్ మరియు గ్లోబ్ ఫేనులకు సంప్రదించండి:
ఆంధ్రా ఎలక్ట్రిక్ కంపెనీ,
115-A దేవాబజార్, మద్రాసు-1.

దరఖాస్తులు

1957—59 సం॥ కాలమందు వీవింగు-స్పిన్నింగ్, అగ్రికల్చర్ కోర్సులోను, టైలరింగు కోర్సులోను; ట్రయినింగు కొరలచి 8 వ తరగతి లేక 8 వ ఫారంనుండి S. S. L. C వరకు చదువుకొన్న వారినుండి ప్రవేశ దరఖాస్తులు కోరబడుచున్నవి. వయస్సు 18 సం॥లకు పైబడినవారి ప్రవేశములు శ్రీ టెక్నికల్ ఎడ్యుకేషన్ డైరక్టరువారి ఎగ్జంప్షన్ ఉత్తర్వులకు లోబడియుండును. హరిజనులు, అనాధలు నిరుపేదలైన విద్యార్థులకు ప్రాముఖ్యత చూపబడును. రు. I. M. O. ద్వారా ఫారములు—వివరములు పొందవచ్చును.

కరెస్పాండెంటు— ఇండస్ట్రియల్ ట్రయినింగు స్కూలు—నాగులపాడు—పెదనందిపాడు. P. O. బాపట్ల తాలూకా.

## క్రీడారంగం

### ఇన్విటేషన్ హాకీ టోర్నమెంటు

#### మద్రాసు జట్టు ఓటమి

మద్రాసు, మే 31: ఇన్విటేషన్ హాకీ టోర్నమెంటులో నేడు మధ్యప్రదేశ్ నుంచి వచ్చిన లాల్‌బాగ్ స్పోర్ట్సుక్లబ్ జట్టు, మద్రాసు బ్లూస్ జట్టును రెండు గోలుల తేడాతో ఓడించి క్వార్టర్ ఫైనల్‌లో ప్రవేశించింది.

బొంబాయిలో జరిగిన గోల్డ్‌కప్ హాకీ టోర్నమెంటులో గెలుపొందిన సెంట్రల్ రైల్వేజట్టు ఇక్కడి టోర్నమెంట్సులో పాల్గొనడానికి నేడు వస్తుంది. కోచ్ ఫ్యాక్టరీ జట్టుపై ఇచ్చుకి ముందు ఒక ఆట ఆడతారు.

### ఫుట్‌బాల్ పోటీలు

మద్రాసు, మే 31: స్టేడియం మైదానంలో నేటి సాయంత్రం జరిగిన ఫుట్‌బాల్ పోటీలో సదరన్ రైల్వే జట్టు 4-1 గోలుల తేడాతో నేతాజీస్పోర్ట్సు క్లబ్ జట్టును ఓడించింది. మరో పోటీలో మినర్వాక్లబ్ జట్టు యంగ్‌మన్సు సోషల్‌క్లబ్ జట్టును 2-1 గోలుల తేడాతో ఓడించింది.

### మైసూరు టెన్నిస్ పోటీలు

బెంగుళూరు, మే 31: కబ్బన్ పార్కు ఆవరణలో జరుగుతున్న మైసూరురాష్ట్ర ఓపెన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో బి. ఆర్. బసవరాజు, బి. యల్. రామారావులను ఎ. కె. ఉదయకుమార్, అఖిర్ అలీలు ఓడించి సింగిల్సు ఫైనల్సుకు అర్హులైనారు.

### క్రికెట్ పోటీలో వెస్టిండీస్ పైచేయి

బర్మింగ్‌హాం, మే 31: వెస్టిండీస్ జట్టుకు ఇంగ్లండు జట్టుకు నిన్న ప్రారంభమైన మొదటి క్రికెట్ టెస్ట్ పోటీలో నేడు ఆట ముగిసే వేళకు వెస్టిండీస్ జట్టు 5 వికెట్ల నష్టానికి 316 పరుగులు చేసింది. అంటే ఇంగ్లండు జట్టుకంటె 130 పరుగులు అధికంగా చేయగలిగింది. ఇంకా 5 వికెట్లున్నాయి. వెస్టిండీస్ జట్టులోని వాల్కాట్ నేడు చూపిన ప్రతిభ ప్రేక్షకులను ఎంతో మెప్పించింది.

మొత్తంగం 4-20 నిముషాలు బ్యాటింగ్ చేశారు.

స్కోర్ వివరాలు:
ఇంగ్లండు—186 పరుగులు (మొదటి ఇన్నింగ్సు)
వెస్టిండీస్—316 పరుగులు (5 వికెట్ల నష్టానికి)

## ఉద్యోగులు — ఉద్యోగాలు

హైదరాబాదు, మే 31: ప్రత్యేక సాయుధపోలీసుదళాల అసిస్టెంట్ కమాండెంట్‌గా తాత్కాలికంగా పని చేస్తున్న శ్రీ బి. వి. డి. ప్రసాద్‌రావును సార్జంట్ మేజరుగా తగ్గించారు. అంబర్‌పేటలోని సెంట్రల్ పోలీస్ లైన్సు ప్రత్యేక సాయుధ పోలీసుదళాల కమాండెంటే అసిస్టెంట్ కమాండెంట్‌గా కూడా వ్యవహరిస్తారు.

శ్రీకాకుళంజిల్లా ఎక్సైజు ఇన్‌స్పెక్టర్ శ్రీ ఎమ్. డి. జియాద్దీన్ సెలవుమీద వెళ్తున్నారు. ఆయనకు బదులు ఆ ఉద్యోగంలో, సెలవునుంచి వచ్చిన తరువాత శ్రీ సి. టి. వి. యరల్ పని చేస్తారు.

శ్రీ వి. ప్రతాపరెడ్డి బదులు ప్రస్తుత ఉద్యోగంనుంచి విడుదలయిన తరువాత రెవెన్యూబోర్డు అసిస్టెంట్ సెక్రటరీగా కామారెడ్డి డిప్యూటీ కలెక్టరు శ్రీ జయరావు పని చేస్తారు.

శ్రీ హబీబ్ అలీఖాన్‌కు బదులు తూర్పు హైదరాబాదు "డెప్యూటీ కలెక్టరుగా ప్రస్తుత ఉద్యోగంనుంచి విడుదలయిన తరువాత మిరియాలగూడా డెప్యూటీ కలెక్టరు శ్రీ కె. ఉమాపతి పనిచేస్తారు.

శ్రీ జయరావుకు బదులు కామారెడ్డి డెప్యూటీకలెక్టరుగా శ్రీ ప్రతాప్‌కరన్ పనిచేస్తారు.

### కృష్ణా పశ్చిమడెల్టా నీటివసరుల సభ

నిడుబ్రోలు, మే 28: కృష్ణా పశ్చిమ డెల్టా నీటివసరుల అధికారుల సమావేశం గుంటూరులో జూన్ 8 వ తేదీన జరుగుతుంది. ఖుద్దాం, ఖాజీపాలెం, గణపవరం గ్రామాలలో మురుగునీటిని ఇంజన్ల చేత తోడించేపథకం, జనవరినుంచి మార్చివరకూ చెరువులలో నీరు నిలవ చేసే పథకం వంటివి సమావేశాలలో పరిశీలనకు వస్తవి.

### రాయల్‌చెరువు గ్రామంలో గ్రామనాయకుల శిక్షణ

రాయల్ చెరువు, మే 26: చిత్తూరు జిల్లా పులిచెర్ల అభివృద్ధి కేంద్రంలోని రాయల్ చెరువు గ్రామంలో గ్రామనాయకుల శిక్షణ శిబిరం ఈ నెల 24 న ప్రారంభమైంది. సభకు శ్రీ కె. రామస్వామి అయ్యంగార్ అధ్యక్షత వహించారు. జిల్లా భారత్ సేవక్ సమాజ్ ఆధ్వర్యాన ఏర్పాటైన ఈ శిబిరాన్ని జిల్లా ఆరోగ్యశాఖ సహాయాధికారి ప్రారంభించారు. దాదాపు 40 మంది శిక్షణపొందారు. జిల్లా భారత్ సేవక్ సమాజ్ సమావేశకర్త శ్రీ సి. రాజగోపాల్ నాయుడు ప్రసంగించారు. వస్తుప్రదర్శన కూడా జరిగింది. రాత్రి విద్యార్థులు వినోద కాలక్షేపం జరిపారు.

## ఆకాశవాణి

సోమవారం, జూన్ 3

హైదరాబాద్
(411 మీటర్లు) (730 కిలో సై)

ఉ॥ 6-50 సుప్రభాత్, 7 తె. వా. 7-15 మాలతీ పద్మనాభరావు 7-45 క. వా. 8 అం. వా. 8-15 హిం. వా. 8-30 వీణ.

మ॥ 12-30 సుగమ సంగీత్ 12-50 మ. వా. 1 సరోద్ 1-10 శాస్త్రీయ సంగీతం 1-50 తె. వా.

సా॥ 5-30 హాషేమ్‌అలీ బృందం 6 ప్రకటనలు 6-15 హాషేమ్‌అలీ బృందం 6-30 గ్రామసీను 7 తె. వా. 7-15 గ్రామసీను 7-30 చిన్న పరిశ్రమలు (ప్రసంగం) 7-45 మాలతీ పద్మనాభరావు 8-45 బాద్రా, తుమ్రీ 9 అం. వా. 9-15 ఉ. వా. 9-30 కవ్వాలీ 10 వీణ 10-30 సమాప్తి.

విజయవాడ
(357.1 మీటర్లు) (840 కిలోసై.)

ఉ॥ 6-30 శుభోదయం 6-40 భక్తిరంజని 7 తె. వా. 7-15 హైదరాబాదు రిలే 7-45 సంగీతశిక్షణ 8 అం. వా. 8-15 హిం. వా.

మ॥ 1 గానసుధ 1-40 హిం. వా. 1-50 తె. వా. 2 వీణ.

సా॥ 5-30 దేవరకొండ సీతాలక్ష్మి 6 వాతావరణం 6-15 గ్రా. కా. 7 తె. వా. 7-15 గ్రా. కా. 7-30 హైదరాబాదు రిలే 7-45 సుగమసంగీత్ 8 సంగీతసంచిక 8-30 దేవరకొండ సీతాలక్ష్మి 9 అం. వా. 9-15 ఆంగ్ల ప్రసంగము 9-30 వాద్యసంగీతం 9-45 హరికథ (సీతాజననం) 10-30 సమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 7-0 వాద్య సమ్మేళనం 7.15 త. వా. 7-30 తిరుచి రిలే.

మ॥ 12-30 యస్. కల్యాణి, ఆర్. రుక్మిణి 1-0 మాదర్ నిగప్పి 1-30 గీత మంజరి 1-40 హిం. వా. 1-50 గీతమాలిక 2-0 త. వా. 2-40 క్లారినెట్ 2-50 సరస్వతీ రామస్వామి (ఫిడేలు).

సా॥ 5-0 పాశ్చాత్య సంగీతం 5-30 సితార్ 6-15 సి. ఆర్. లక్ష్మీనారాయణరావు 6-45 యస్. జానాంబాళ్ 7-15 త. వా. 7-30 జంత్ర సమ్మేళనం 7-45 భజన 8.0 జానాంబాళ్ 8.30 యల్. కృష్ణమూర్తి 9-15 హిందీపాఠం 9-30 లాల్‌గుడి జి. జయరామన్ (ఫిడేలు) 10-30 సమాప్తి.

మద్రాస్ (బి)
211.3 మీ. (14.20 కిలో. సై)
41.32 మీ. (72.60 కిలో. సై)

ఉ॥ 6-50 మద్రాసు ఎ వలె 7 తె. వా. 7-15 ఉదయగానం 7-30 మదరాసు ఎ వలె 8 అం. వా.

మ॥ 12 కొర్కె, కొర్కు. 12-30 మద్రాసు ఎ వలె 1 గీతమాలిక 1-30 అం. వా. 1-40 గానమంజరి 1-50 తెలుగు వా. 2 గీతమంజరి 2-10 మదరాసు ఎ వలె.

సా॥ 5 మద్రాసు ఎ వలె 5-50 ప్రకటనలు 6 అం. వా. 6-15 గ్రామ కాం. 7 తెలుగు వా. 7-15 గ్రా. కాం. 7-30 హైదరాబాదు రిలే 7-40 మలయాళ ప్రసంగం 8 మద్రాసు ఎ వలె 9 అం. వా. 9-15 సప్తపది (నాటిక) 9-30 మద్రాసు ఎ వలె 10-30 సమాప్తి.

## మదరాసు ధరలు

మదరాసు, జూన్ 1:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకను 1-3 ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 72.25
మేలిబంగారం తులం రు. 109.25
మూసా బంగారం తులం రు. 108.25
వెండి తులం 100కి రెడి 186.50
చిల్లర ధర రు. 1.98

వేరుశనగ
(551 పా॥ 1-3 ఎక్సుపోర్టు గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా
డిసెంబరు రు. 157-161
వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ విలో % పా.) రెడి చిల్లర ధర 380.00
50 వెంకాయనూనె (87½ పౌనులు సేల్సుటాక్సు అదనం,
అంబుమార్కు రు. 80.00
ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా 81.00
రాజా రు. 80.50

ఆముదం
తిరుపత్తూరు (500 పా.) రు. 360

పంచదార
సేలం లోటస్ క్యాన్ (87½ పా) 28.00
ప్యాకిస్ (2 అందరు) 102.68-108.22

### న్యూయార్క్ దూది

అక్టోబరు వాయిదా ధరలు

న్యూయార్క్, మే 31:
న్యూయార్క్, కాటన్ మార్కెట్ ధరలు ఈ దిగువ విధంగా ఉన్నవి:
నేటి ప్రారంభ ధర 34.32
నేటి ముగింపు ధర 34.28

## రాజుల గురువాయపల్లి ప్రాథమికపాఠశాల

### ప్రణాళికల శాఖ మంత్రిచే భవనం శంకుస్థాపన

ప్రొద్దుటూరు, మే 25: రాజుల గురువాయపల్లిలో ప్రాథమిక పాఠశాల భవనానికి ప్రణాళికల శాఖ మంత్రి శ్రీ వల్లూరి బసవరాజు శంకుస్థాపన చేశారు. జిల్లా కలెక్టరు శ్రీ సయ్యద్ అహమ్మద్ రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు శ్రీ పి. ఆదినారాయణరెడ్డి, జిల్లా ప్రణాళికల శాఖాధికారి శ్రీ ఎమ్. రాంసింగ్ శ్రీయుతులు సి. వెంకటసుబ్బయ్య, వై. ఆదినారాయణరెడ్డి మొదలయిన వారు వెంటరా మంత్రి నిన్న ఇక్కడికి వచ్చారు. ఇక్కడి నుంచి మున్ననూరు సమీపంలోని రాజుల గురువాయపల్లి గ్రామానికి వెళ్లారు. శాసన సభ్యులు శ్రీయుతులు కె. రామయ్య, ఎన్. కంభరెడ్డి గారలూ, కడపజిల్లా భారత్ సేవక్ సమాజ్ సహాయ సమావేశకర్త శ్రీ ఆర్. రామసుబ్బారెడ్డి, జమ్మలమడుగు తాలూకా భారత్ సేవక్ సమాజ్ సమావేశకర్త శ్రీ ఎమ్. దిబ్బారెడ్డి, అభివృద్ధిశాఖ ఉద్యోగి శ్రీ జి. శ్రీనివాసాచారి, జమ్మలమడుగు తహసీల్దారు శ్రీ ఆర్. అశ్వత్థరెడ్డి మొదలయిన వారు మంత్రికి స్వాగతం చెప్పారు.

రాజుల గురువాయపల్లి గ్రామాన్ని ప్రధాన రస్తాతో కలుపుతూ భారత్ సేవక్ సమాజ్ నిర్మించిన మైలు రోడ్డును మంత్రి తనిఖీ చేశారు.

శ్రీ ఆర్. అశ్వత్థరెడ్డి దానంగా ఇచ్చిన స్థలంలో ప్రాథమిక పాఠశాల భవనానికి మంత్రి శంకుస్థాపన చేశారు.

శ్రీ వై. ఆదినారాయణరెడ్డి అధ్యక్షత వహించిన జరిగిన సభలో పెనికలపాడు పంచాయతీ తరఫున మంత్రికి సన్మాన పత్రాన్ని శ్రీ ఆర్. సీతారామయ్య సమర్పించారు. రాజుల గురువాయపల్లి గ్రామ పంచాయతీ తరఫున విజ్ఞప్తిని శ్రీ హనుమంతరెడ్డి సమర్పించారు.

భారతసేవక్ సమాజ్ తరఫున మంత్రికి శ్రీ ఆర్. రామసుబ్బారెడ్డి స్వాగతం చెప్పారు. జిల్లా అభివృద్ధి సంఘాలలో భారతసేవక్ సమాజ్‌కు ఇప్పటికంటె ఎక్కువ ప్రాతినిధ్యం ఇప్పించవలసినది గానూ, సమాజ్ కార్యకలాపాలలో అధికారులు ఇంకా ఎక్కువగా సహకరించేటట్లు ఏర్పాటు చేయించవలసినదిగానూ మంత్రిని కోరారు.

సమాజ్ కార్యకలాపాలను శాసన సభ్యుడు శ్రీ ఎస్. కంభరెడ్డి వివరించారు. భారత సేవక్ సమాజ్ కృషిని మంత్రి ప్రశంసించారు. వినోద ప్రదర్శన, మంత్రి గౌరవార్థం విందు జరిగినవి.

## గాంధీ వైద్య కళాశాల

### ప్రవేశ ఏర్పాట్ల వివరణ

హైదరాబాదు, మే 31: హైదరాబాదులోని గాంధీ వైద్యకళాశాల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నిర్వహణలోనే ఉన్నది. ఈకళాశాలలో విద్యార్థులను చేర్చుకునే సందర్భంలో కూడా హైదరాబాదులోని ఉస్మానియా వైద్యకళాశాల నిబంధనలనే అనుసరిస్తారు. ఈ రెండు కళాశాలలూ ప్రభుత్వ నిర్వహణలోనే ఉన్నవి. కనుక గాంధీ వైద్యకళాశాలలో చేరి విద్యాభ్యాసం చేయదలచిన విద్యార్థులు వివరాలూ, దరఖాస్తులకోసం ఉస్మానియా వైద్యకళాశాల ప్రధానాధ్యాపకునికి వ్రాయాలి.

### బస్సుప్రమాదంలో వృద్ధురాలి మరణం

హొసపేట, మే 30: కమలాపురం పోయే బస్సు యలసపనడి ప్రాంతంలో ప్రమాదవశాత్తు ప్రక్కకు ఒరిగి పడిపోయింది. ఒక వృద్ధురాలు మరణించింది. గాయపడినవారిని ఇక్కడి ఆస్పత్రిలో చేర్చారు.

మైసూరు పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ వీరన్నగౌడ నిన్న తుంగభద్ర ప్రాజెక్టును సందర్శించారు. పురపాలక సంఘం వినతిపత్రం సమర్పించింది. మంత్రి సమాధానమిస్తూ పట్టణంలోని ప్రధాన వీధులు యీ ఏడాది కంకర రోడ్లుగా మార్చి వచ్చే ఏడాదిఅయినా సిమెంటురోడ్లుగా చేయాలని సూచించారు. (స్వ. వి.)

### భీమవరంలో మశూచివల్ల 8 మంది మరణం

భీమవరం, మే 29: పట్టణంలో ఇప్పటివరకు 26మందికి మశూచి వ్యాధి తగిలినది. 8 మంది చనిపోయారు. పురపాలక ఆరోగ్యశాఖవారు చాలా ప్రాంతాలలో టీకాలువేస్తున్నారు. వ్యాధి తగ్గుముఖం పట్టినట్లు చెప్పవచ్చును. (స్వ. వి.)

### వేటపాలెం నటరాజ నట బృందం

వేటపాలెం, మే 28: నటరాజ ఆర్టు థియేటర్సు అసోసియేషన్ ప్రథమ వార్షికోత్సవం శ్రీ బండ్ల చినబాపయ్యశెట్టి అధ్యక్షతన నిన్న జరిగింది. శ్రీయుతులు పూసపాటి వెంకటనరసింహారావు, టి. వి. శేషాద్రి, కరణం నాగేశ్వరరావు, ఎస్. లక్ష్మీకాంతరావు, నాసిక మల్లికార్జునరావు, దండా రామిరెడ్డి, అచ్యుతన్న బాలకృష్ణమూర్తి, శ్రీ కేరాం సత్యనారాయణస్వామి గారలు ప్రసంగించారు. సమాజానికి తోడ్పడినవారందరికీ కార్యదర్శి శ్రీ నరసింహారావు వందనసమర్పణ చేశారు.

# తిరుపతిలో పశువైద్య కళాశాలకు సౌకర్యాలు

## భవనం ఇవ్వడానికి దేవస్థానం సమ్మతి

తిరుపతి, మే 30: తిరుపతిలో పశువైద్యకళాశాలను ఏర్పాటుచేయటానికి అవసరమైన భవనాన్ని ఇస్తామని తిరుపతి దేవస్థానం ధర్మకర్తలసంఘం ప్రభుత్వానికి తెలియచేసింది. నిన్న జరిగిన ఈ సమావేశానికి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు.

ప్రకాశంపంతులు గారి మరణానికి సంతాపం ప్రకటించారు. బొంబాయి వర్తకుడు శ్రీ రామకృష్ణదూయా విరాళంగా ఇస్తానన్న రు 5 లక్షలతో తిరుపతిలో 100 మంది రోగుల మంచాలతో ఆసుపత్రిని ఏర్పాటుచేయాలని ఈ నెల 18 న హైదరాబాదులో జరిగిన నిర్ణయాన్ని దేవస్థానం ఆమోదించింది; ఈ ఆసుపత్రి నిర్వహణ ఖర్చును ప్రభుత్వం భరించే షరతుకు లోబడి దేవస్థానం రు 10 లక్షల విరాళం ఇస్తుందని తెలియచేశారు.

తిరుమలకు ఆరోగ్యశాఖాధికారిగా డాక్టరు ఎమ్. నరసింహాన్ని నియమించారు.

తిరుపతిలో పశువైద్య కళాశాలను ఏర్పాటుచేస్తే దేవస్థానం ఆకళాశాలకు ఏమి సౌకర్యాలను అమర్చుతుందని రాష్ట్రప్రభుత్వం వ్రాసిన జాబును పరిశీలించి పాలీటెక్నిక్ విద్యాశిక్షణ కేంద్రానికి ఇవ్వదలచిన భవనంలోని మొదటి అంతస్తును పశువైద్య కళాశాలకు ఇవ్వాలని ధర్మకర్తలసంఘం నిర్ణయించింది. పశువైద్యకళాశాల సౌకర్యానికి దేవస్థానం ఆధ్వర్యంలోని పశుక్షేత్రాన్ని ఇవ్వాలనికూడా నిర్ణయించారు. పశువైద్య కళాశాలకు శాశ్వత భవనం కట్టించేందుకు తమ ఆవరణలో కొంతస్థలాన్ని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అధికారులు ఇస్తారు.

తిరుపతిలో వృక్షశాస్త్ర పరిశోధక ఉద్యానవనం ఒకదానిని ఏర్పాటుచేయాలని ప్రభుత్వం చేసిన ప్రతిపాదనను ధర్మకర్తలసంఘం ఆమోదించి పెట్టుబడి ఖర్చు రు. 55 వేలు, నిర్వహణ ఖర్చులో 3 వ వంతూ భరించడానికి అంగీకరించారు.

శ్రీ ఎ. వెంకటరామయ్య సూచననుసరించి తిరుపతిలో జంతు ప్రదర్శనశాల ఒక దానిని ఏర్పాటుచేసి, దానిని క్రమపద్ధతిలో అభివృద్ధిచేసే పథకం తయారుచేయవలసినదిగా దేవస్థానం కార్యనిర్వహణోద్యోగిని ధర్మకర్తలసంఘం కోరింది.

తిరుమలకు ఎక్స్‌ప్రెస్ బస్సులలో రద్దీ తగ్గించడానికి వీలుగా మరికొన్ని బస్సులను కొనాలని నిర్ణయించారు. దేవస్థానం ఆధ్వర్యంలోని రవాణా సౌకర్యాలలో (బస్సులు) పనిచేసే వారికి, త్రైపాక్షిక సంఘం సిఫార్సు చేసిన సేవా నిబంధనలను అమలు జరపాలని నిర్ణయించారు.

పద్మావతి మహిళా కళాశాలకు రు.7,85,000 ఖర్చు అంచనాతో మూడు అంతస్థుల భవనం కట్టించే ఒక పథకాన్నీ, మరో పెద్ద సత్రాన్ని కట్టించే రు. 950 వేల పథకాన్నీ ధర్మకర్తల సంఘం ఆమోదించింది.

పద్మావతి మహిళా కళాశాల నిర్వహణను శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి ఇచ్చే ఆలోచనను ధర్మకర్తల సంఘం విరమించుకొన్నదని అధ్యక్షుడు చెప్పారు.

## చవక దుకాణాలను ఏర్పాటు చేయించాలి

### విజయవాడ రవాణా కార్మిక సంఘం విజ్ఞప్తి

విజయవాడ, మే 28: చవక దుకాణాలను విరివిగా ఏర్పాటు చేయించి తక్కువ ధరలకు ఆహార ధాన్యాలను సప్లయి చేయించవలసినదిగా ప్రభుత్వానికి విజయవాడ రవాణా కార్మికసంఘ సర్వ సభ్య సమావేశం విజ్ఞప్తి చేసింది. శ్రీ రాంపిళ్ళ నయ్యద్ అప్పలస్వామి అధ్యక్షత వహించారు. ఇరవై మైళ్ళలోపు ప్రదేశాలకు సరుకుల రవాణాను ఎడ్ల బళ్ళమీద జరిపే ఏర్పాటు చేయించవలసినదిగా ప్రభుత్వాన్ని కోరారు. సహకార పద్ధతిలో ఒక ఆసుపత్రిని నిర్మించాలని నిర్ణయించారు.

## నెల్లూరులో సబ్బులను తయారుచేసే కేంద్రం

నెల్లూరు, జూన్ 1: అఖిలభారత ఖద్దరు గ్రామ పరిశ్రమల మండలి ఇచ్చే డబ్బుతో నెల్లూరులో నమూనా సబ్బుల పరిశ్రమ - గానుగనూనె కేంద్రాన్ని ఈ నెల 4 వ తేదీన ఏర్పాటు చేస్తారు.

## కొత్తపేట తాలూకా గ్రామోద్యోగులు

### రాజీనామాలు సిద్ధం

కొత్తపేట, మే 28: జూన్ 20 వ తేదీదాకా జమాబందీ లెక్కలను తయారు చేయడానికి గడువు ఇవ్వవలసినదిగా గ్రామోద్యోగులు అమలాపురం రెవెన్యూ డివిజనల్ ఆఫీసరును కోరగా ఆయన నిరాకరించారు. దాని మీదట ఉద్యోగాలకు రాజీనామాలను గ్రామోద్యోగులు సిద్ధం చేశారు. జమాబంది ఉద్యోగికి ఆ సంగతి తెలియజేశారు. రెవెన్యూ మంత్రికీ, రెవెన్యూ బోర్డు కార్యదర్శికీ, జిల్లా కలెక్టరుకూ తంతి ద్వారా తమ రాజీనామాల వ్యవహారాన్ని గ్రామోద్యోగులు తెలియజేశారు.

## ప్రభుత్వమే తేల్చాలి

### లంకపల్లి ఫిర్కా గ్రామోద్యోగుల విజ్ఞప్తి

లక్ష్మీపురం, మే 28: వంశపారంపర్య గ్రామోద్యోగులకు ఉద్యోగాలు నిలిచే హక్కు ఉండాలా లేదా మిగతా ఉద్యోగులందరి మాదిరిగానే వారికికూడ వేతనాలు యివ్వాలనే సమస్యలో ఏదో ఒకటి ప్రభుత్వమే నిర్ణయించాలని ఈ నెల 26 న జరిగిన లంకపల్లి ఫిర్కా గ్రామోద్యోగుల సంఘ సమావేశం ప్రభుత్వానికి విజ్ఞప్తిచేసింది. సమావేశానికి శ్రీ అంజా నరసింహారావు అధ్యక్షత వహించారు.

ప్రకాశంపంతులుగారి మరణానికి సంతాపం ప్రకటించారు. శ్రీయుతులు కోడూరి రాజారావు, డి. వి. వి. జనార్దనరావు, డి. వి. శివరామకృష్ణయ్య మొదలయినవారు ప్రసంగించారు.

వసూలుచేయ వలసిన శిస్తు ఎక్కువ కనుక జమాబందిని జూలై 15 దాకా వాయిదా వేయవలసిందిగా దివి తాలూకా గ్రామోద్యోగుల సంఘం కోరినా కూడా లెక్కలు చెయ్యకుండా 17-6-57 నుంచి జమాబంది జరిపిస్తున్నారు కనుక దానికి గ్రామోద్యోగులు హాజరుకారాదని నిర్ణయించారు రాజీనామా పత్రాలను తయారుచేసి తాలూకా సంఘాధ్యక్షునికి ఇవ్వాలని నిర్ణయించారు.

గ్రామోద్యోగుల వేతనాలను ఎక్కువ చేయడానికి డబ్బులేదంటూ వంశపారంపర్య హక్కును వదులుకొని బదిలీలకు అంగీకరించితే వేతనాలను ఎక్కువచేసే సంగతి ఆలోచిస్తామనడం అసంబద్ధంగా ఉన్నదని తీర్మానంలో వివరించారు. గ్రామోద్యోగులకు కావలసినది కుటుంబ పోషణకు సరిపోయే జీతం కాని మరేమీ కాదని కూడా వివరించారు.

## జమాబందికి వ్యవధి కావాలి

### ఉండ్రాజవరం ఫిర్కా గ్రామోద్యోగుల విజ్ఞప్తి

తణుకు, మే 30: జమాబంది జూలై 15 వ తేదీ తరువాత జరిపించవలసినదిగా ప్రభుత్వానికి ఉండ్రాజవరం ఫిర్కా గ్రామోద్యోగుల సంఘం విజ్ఞప్తిచేసింది. ఈనెల 28 వ జరిగిన ఈ సమావేశానికి శ్రీ సుంకర శేషగిరిరావు అధ్యక్షత వహించారు.

లెక్కలు తయారు చేయడానికి అవసరమైన కేలాలూ, కాగితాలవంటివి చాలినన్ని లేవు. నీటితీరువ ఎక్కువ చేశారు. కనుక లెక్కలు సమగ్రంగా తయారు చేయడానికి వీలుగా జూలై 15 వ తేదీ తరువాత జమాబంది జరిపించవలసినదిగా తీర్మానంలో ప్రభుత్వానికి గ్రామోద్యోగులు విజ్ఞప్తి చేశారు.

## తేలప్రోలు పంచాయతీ

### అధ్యక్షుని ఎన్నిక

తేలప్రోలు, మే 28: కృష్ణాజిల్లా తేలప్రోలు పంచాయతీ అధ్యక్షుడుగా శ్రీ గుంటక పుల్లారెడ్డి ఎన్నికయినారు. మహిళా సభ్యురాలుగా శ్రీమతి వందకర్ల సోమాతుమ్మ ఎన్నికయినారు.

అటుతరువాత జరిగిన పంచాయతీ బోర్డు ప్రత్యేక సమావేశంలో ప్రకాశంపంతులుగారి మృతికి సంతాపం తెలియచేశారు.

## ప్రకటన

సికిందరాబాదు (Secunderabad)లో ఆంధ్రపత్రిక, సచిత్ర వారపత్రిక, భారతులను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు శ్రీ ఆర్. సత్యనారాయణగారిస్థానే M/S. J. C. Pinto & Co. 113/1, సరోజినీదేవి రోడ్డు, సికిందరాబాదువారిని 1-6-1957 నుండి నియమించడమైనది.

మేనేజర్, ఆంధ్రపత్రిక

## అనకాపల్లిలో అగ్నిప్రమాదం

### రు 4 వేల నష్టం

అనకాపల్లి, మే 30: చేలోకల్లం వంటె పొయ్యిలోంచి నిప్పు ఎగిరిపడినందున ఈ నెల 27 న ఆ ఇరుగు పొరుగులోని ధాన్యం, కలప, ఉల్లిపాయలవంటివన్నీ పరశురామ ప్రీతి అయినవి. సుమారు రు 4 వేల నష్టం సంభవించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
ఎక్స్‌ట్రాక్ట్

ధర్మాదాయములు-గుంటూరు జిల్లా-బాపట్ల తాలూకా - నాగండ్ల గ్రామం-కస్పా చెరువు-మిస్ మేనేజ్ మెంటు - మద్రాసు హిందూమత ధర్మాదాయ చట్టము 1951 లోని ప్రొవిజనులను వర్తింపచేయుట-ప్రారంభపు నోటీసు-జారీచేయనైనది.

సంఘ సంక్షేమ అండ్ లేబర్ డిపార్టుమెంటు G. O. Ms. No. 398 18-4-57 ఈ క్రిందివిధముగా నున్నది.

చదివినది: హిం. మ. ధ. ట్రస్టుల స్పెషల్ ఆఫీసరునుండి ఎస్. ఒ. ఐ. నం. 159/54 తే 29-9-56.

హిం. మం. & ధ. అ. (ఎ) శాఖ కమీషనరు నుండి ఎ 2/30280/56 తే. 1-12-56 ఉత్తరము.

బోర్డు ఆఫ్ రెవిన్యూ, బి. ఓ. ఆర్. టి. 84/57 తే 31-12-56.

ఆర్డరు: ఈదిగువ నోటీసు ఆంధ్ర ప్రదేశ్ గెజెట్‌లో ప్రకటించబడును.

నోటిఫికేషన్

క్రింది షెడ్యూలులో స్పష్టీకరించిన ప్రకారం గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా నాగండ్ల గ్రామంలో "కస్పా చెరువు" అని పిలువబడే ధర్మాదాయసంస్థ పరిపాలన సక్రమంగా లేదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విన్నపాలు వచ్చినందుననూ;

సదరు ధర్మాదాయ సంస్థను సక్రమంగా పరిపాలించటం లేదని ప్రభుత్వము నమ్ముటకు తగిన కారణము లున్నందుననూ;

సదరు ధర్మాదాయసంస్థ పరిపాలనా శ్రేయస్సుకొరకు, 1951 మదరాసు హిందూమత, ధర్మాదాయముల చట్టము (మద్రాస్ ఆక్టు XIX ఆఫ్1951)యొక్క అన్ని షరతులున్నూ, సదరు చట్టము క్రింద చేయబడిన నిబంధనలున్నూ, పై సంస్థకు వర్తింపజేయవలసిన అవసరమున్నట్లు ప్రభుత్వం తృప్తిపడి ఉన్నందుననూ;

సదరు చట్టములోని 3 (1) సెక్షన్ వలన సంక్రమించిన అధికారమునుబట్టి ఆంధ్రప్రదేశ్ గవర్నరు సదరు చట్టములోని అన్ని షరతులున్నూ, దానిననుసరించి చేసిన నిబంధనలున్నూ యీ ధర్మాదాయ సంస్థకు వర్తింపజేయ తలచుచున్నందుననూ;

ఇప్పుడు, సదరు చట్టములోని సెక్షన్ 3 (1) ననుసరించి, సదరు ధర్మాదాయ సంస్థలో సంబంధంగల వారందరికిన్నీ యీ నోటీసు మూలకముగా పై ధర్మాదాయ సంస్థకు పై చట్టములోని షరతులన్నీ, మరియు దాని ననుసరించి చేసిన నిబంధనలన్నియూ యేల వర్తింపజేయరాదో 12-8-1957, తేదీనగాని లేక అలోపుగాగాని తెలుపుకొనవలసినదిగా తెలియజేయడమైనది.

సదరు గడువులోగా గాని, లేదా ఆ తేదీని గాని దాఖలైన పిటిషనులను సెక్రటరీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, సాంఘిక సంక్షేమ కార్మిక శాఖ, హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ ఆలోచిస్తారు.

(గవర్నరు ఉత్తరువుతో)
కే. ఎస్. అనంతరామన్,
ప్రభుత్వ కార్యదర్శి.

షెడ్యూలు

(1) శ్రీ కర్లేపల్లి వీరరాఘవరాజు తదితర ట్రస్టీలు, అంతకుముందు ఆఫీసులో నున్నవారు చెరువుకు చేయవలసిన మరమ్మత్తులను చేయించి సదరు చెరువు ద్వారా గ్రామములోని ప్రజలకుపరిపడే టంత నీటిని సరఫరా చేయునట్లు చూచుట మాని ధర్మసంస్థయొక్క ఉద్దేశ్యమునే విస్మరించి భంగము కలుగ చేయుచున్నారని చెరువు యొక్క లోతులేని పరిస్థితి తెలుపుచు చేయుచున్నది.

(2) వేరే మంచినీటి సౌకర్యము కలిగే ఆధారములు లేక సదరు గ్రామస్థులు చాల దురవస్థలు పొందుచున్నారు.

(3) సదరు చెరువు ధర్మాదాయమును చట్టవిరుద్ధంగా మూడు సమభాగములుగా ఆఫీసులో పంపకం చేసుకొని ప్రస్తుత ట్రస్టీలు, వారిముందు వారు అనుభవించిరి.

(4) ధర్మాదాయమును వారి సొంతముగా భావించి దాని ఆదాయమును వంటనూ అక్రమపరుచుచున్నారు.

(5) ధర్మాదాయపు ముఖ్య ఆదర్శములకు పూర్తి విరుద్ధముగా సదరుభూములు ప్రయివేటుగా తక్కువ రేట్లకు శిస్తుల కిచ్చుచున్నారు.

(6) మనస్ఫూర్తిగా చెరువు మరమ్మత్తులను మాని చేద్దామని మానుటవలన, ప్రజలు వారిమామూలు, 'తెప్ప ఉత్సవములను' జరుపుకొనలేకపోవుటయే కాక సదరు ధర్మాదాయసంస్థకు చేపలపైవచ్చే ఆదాయాన్ని పోగొట్టుకోవలసివచ్చింది.

(7) ప్రస్తుత ట్రస్టీలచేగాని, వారికి ముందు వారిచేగాని ఆఫీసులో ఎక్కౌంట్లు సరిగా వ్రాయబడి లేదు.

(8) చెరువుకుగల నాగండ్ల గ్రామములో నివాసము లేక సదరు గ్రామమునకు 8 మైళ్ళ దూరములోగల చింతగుంట వారి పాలెంలో సదరు ట్రస్టీలు నివసించుచున్నారు.

# ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధం

1957 సం॥ జూన్ 2వ తేదీ ఆదివారం


పాటల పేటిక:

# స్వర్గీయ శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

పి. గణపతిశాస్త్రి

ఇటీవల ఆంధ్రకేసరి స్వర్గమనవార్తతో అగ్రమ్యమయిన ఆంధ్ర జాతికి నండూరి వెంకటసుబ్బారావుగారి అస్తమయవార్త ఒక పెద్ద పిడుగుపాటు. వీరి మృతి ఆధునిక, సార్వజనీనము అయిన గేయసాహిత్యానికి తీరనిలోటు.

సుబ్బారావుగారి ఎంకిపాటల రచన కించుమించుగా ఏభైఏళ్లు నిండాయి. వీరిపాటల రచన మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో పట్టపరీక్షకు చదువుకునే రోజుల్లోనే ప్రారంభించారు. అప్పటి నుంచి మొన్న మొన్నటివరకు వీరి గేయ రచన అవిచ్ఛిన్నంగా సాగుతూ వచ్చింది.

ఆ రోజుల్లో నవ్యసాహిత్య అనేకశాఖలలో రొమాంటిక్ లిరిక్కులలో బలపడటం మొదలుపెట్టింది. అప్పటి విద్వాంసులకు వ్యావహారిక వచనరచన అంటేనే ఒక పెద్ద ఈసడింపు. అందులోను సుబ్బారావుగారు కేవలం జానపదకవితామార్గంలో ఒకవిధమైన వ్యావహారిక శైలిలో తమ గేయరచన ప్రారంభించారు.

"గుండె గొంతుకలోన
కొట్లాడుతాదీ!
కూసుంచ నీదురా
కూసింతసేపు!"

మొట్టమొదటి పాటలో లోలోపలే కుళ్లుతిరిగి తిరిగి ఒక నిర్దిష్టరీతి ప్రవాహంలా, అప్రయత్నంగా పైపైకి ఉబికి వచ్చింది. కొందరిది విని 'పెళ్లాసో' అన్నారు. మరికొందరిది సరిగా లేదని తప్పులెంచివేశారు.

స్వచ్ఛమైన వ్యావహారికంలో గేయరచన ప్రక్రమించిన బసవరాజు అప్పారావుగారే మొట్టమొదటి గేయం విని 'ఏవు నిత్యంనాకె భాషకాదిది. ఈ భాష సాయమున సత్యస్వరూపం చేయలేకున్నాడు. కాని పోగాపోగా కొంతకాలానికాయన కవిమిత్రునితో ఏకీభవించక తప్పలేదు.

సాహిత్యంలో తరువాతం తెలిసిన అప్పారావువంటివారికే మొట్టమొదట ఈ రచనపై కొంత అనుమానం ఉండటం, దరిచేరి ఇక నిగ్గితేలిన వారికే ఇదంతా విడ్డూరంగా కనిపించడంలో ఆశ్చర్యం ఏమి ఉంది.

## "ఎంకిపాటల గాలి దుమారం"

ఆపైన ఎంకి పాటలమీద పెద్ద గాలి దుమారం చెలరేగింది. కొందరిది గ్రామ్యమయిన అసభ్య శృంగారమన్నారు... మరికొందరలా కొక్క శాస్త్రసంప్రదాయాలేని కుంటుపద్యాలన్నారు. అయితే పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రివంటి దిగ్గజులే "ఎంకిపాటలు" సమర్థిస్తూ వాదోపవాదాలుసాగించారు. క్రమక్రమంగా ఎంకిపాటలపై చెలరేగిన "గాలిదుమారం" పుష్పవృష్టి గామారింది. సహృదయులందరు ఈ గేయరచన నవ్యకవితామార్గంలో ఒక ప్రత్యేక వ్యక్తిత్వ ముద్ర గలిగిన ప్రస్థానమని అంగీకరించారు.

## దేశిమార్గం

మొట్టమొదటినుంచీ నవ్యసాహిత్య కవితా ప్రస్థానంలో దేశి కవితారీతి ఒకటి వర్ధిల్లింది. ఈ మార్గం కవులందరికీ వర్డ్సువర్త్ వంటి పాశ్చాత్యకవుల ఒరవడి కొంతవరకు ప్రోత్సాహం కలిగించింది. ఆపైన వ్యావహారిక భాషోద్యమం మరింత చేయూతనిచ్చింది. మొట్టమొదటగా గురజాడ అప్పారావుగారు తమ ముత్యాలసరాలలో ఈ దేశికవితా మార్గానికి ముత్యాలముగ్గులుతీర్చిదిద్దారు. తరవాత బసవరాజు అప్పారావు చాలావరకీ మార్గమే అనుసరించారు. కవికొండల వెంకటరావు, అడవిబాపిరాజు మొదలయినవారు కీ రీతిలో ఎన్నెన్నో కొత్త పాటలు తీర్చారు. ఇందరివి వారి రచనలూ దేశిప్రస్థానానికి చెందినవే. అయితే వీరిగేయాలలో ప్రత్యేకించి లోతు కూడ ప్రత్యేక వ్యక్తిత్వ ముద్ర పడింది. వీరి గేయరచనఅంతా మొత్తం మీద మూడుదశలుగా మూడు విభాగాలుగా విభజించుకోవచ్చును.

### మొదటి దశ

వీరి మొట్టమొదటి గేయ సంపుటి 1925 లో వెలువడింది. ఈ సంపుటిలో మొత్తం గేయాలు 66. వీటిలో కొన్నింటికి అడివి బాపిరాజుగారు చిత్రాలు రచించారు. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు పారుపల్లి రామకృష్ణయ్యగారు ఆ రాగాలలో స్వరకల్పన చేశారు. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు "రోకటి రెండు పాటలు"లో పీఠిక రచించారు.

ఈ సంపుటిలో రెండు మూడు గేయాల ధోరణి ప్రత్యక్షంగా 'ఎంకి పాటల' ధోరణిలో సమన్వయించదు. అయినా ఈ పాటలకుకూడా 'ఎంకి పాటల'తో కొంత పరోక్ష సంబంధం లేకపోలేదు. యీ పాటలన్నిటిలోను 'ఎంకి-నాయుడు బావల, సుందర స్వచ్ఛ పరిసరాలు, సహజమయిన ఆంధ్రదేశీయ జానపద పరిసరాలు, వాటితో అడుగడుగునా పెనవేసుకున్న ఎంకి నాయుడు బావల కష్టసుఖాలు—మనోజ్ఞంగా ప్రతిఫలించాయి. నేటి కవిత్వపు గేయసాహితిలో యీ పాటల ధోరణి అనితర సాధారణమయిన విశిష్టతతో వన్నెకెక్కింది. ఈ పాటలలో కవితకు పైచేయి. సంగీతం కవితకోసం ఊతకర్రగానే నడిచింది. అయినా అపూర్వమయిన ఈ గేయపద్ధతి ఆంధ్ర శ్రోతల హృదయాలను ఊగించింది.

సుబ్బారావుగారు లా కాలేజీలో చదువుకొనే రోజులలోనే ఈ గేయాలు తెలుగునాట బాగా అలజడి లేవదీశాయి. సుబ్బారావుగారాంధ్ర భాషలోగాని, సంగీతంలోగాని గొప్ప విద్వాంసులు కాకపోవచ్చును. కాని గేయ రచన కనుకూలమయిన సహజ ప్రతిభ వారికి పుట్టుకతోనే అలవడింది. ఆపైన వారిది తీయని గాత్రం. సుబ్బారావుగారు స్వయంగా ఎంకిపాటలు పాడుతూంటే విన్నవారా మధురానుభూతి ఎన్నటికీ మరిచిపోలేరు. పెద్ద పెద్ద సదస్సులలోకూడా ఆయన గొంతెత్తి పాడుతూంటే సదస్సులంతా శిలా ప్రతిమలై పోయేవారు. ఆధునిక కవితావ్యాప్తికి ఆ రోజుల్లో వారి గాన ధోరణి చేయూత ఇచ్చిందంటే అతిశయోక్తి కాదు. మొదటి దశలో వెలువడినపాటలన్నీ మన తెలుగుపాటల కమ్మదనంతో ఒక ఆవేశంతో ఆవేదనతో, తీయదనంతో సుకారిస్తాయి.

### రెండవ దశ

ఏలూరులో లాయరుగిరీ చలాయిస్తున్నా సుబ్బారావుగారి గేయరచన ఎన్నడూ కుంటుపడలేదు. వీరి గేయాలప్పుడప్పుడు పత్రికలలో ప్రత్యక్షమౌతూనే ఉండేవి. ఈ దశలో రచించిన కొన్ని గేయాలలో పూర్వగేయాల జానపద ధోరణి కొంతవరకు మారింది. సుబ్బారావుగారీదశలో మళ్లీ పాతిక ముప్పయి గేయాలదాకా రచించారు. వీటిలో ఆయన గేయ రచనాకౌశలం అత్యున్నత స్థాయికి వెళ్లింది. మొట్టమొదటగా ఈ గేయాలు కొన్ని 'త్రైమాసికల'లో ప్రచురించారు. ఈ దశ వచ్చేసరికి సుబ్బారావుగారి గేయ భావంలోకూడా కొంత మార్పువచ్చింది. భాష చాలా వరకు గ్రాంథికంవైపు మొగ్గింది. మొట్టమొదట బసవరాజు అప్పారావుగారు 'ఎంకిపాటల' మీద చేసిన విమర్శ కొంతవరకే నిజం!

ఏ రచయితా సరిగ్గా మనంమాట్లాడుకునే తీరులో వచనరచన చెయ్యలేదు. గేయరచన అయితే అది మరింత కష్టం! వ్యావహారికంలో— గేయ రచనకైనా, వచన రచనకైనా కొంత శిష్టత కొంత 'ప్రత్యేకత' తప్పవు. నండూరివారు రీతువంటి 'ప్రత్యేక శైలి'లోనే తమ గేయ రచన సాగించారు. రెండవదశలో ఈ ప్రత్యేకత ఇంకొక మెట్టు పైకి వెళ్లిపోయింది. ఎంకి — నాయుడు బావలకంటే కవి వ్యక్తిత్వమే ఈ దశలో ఎక్కువగా ప్రతిబింబించింది.

ఈ గేయాలు మొదట రచించిన గేయాలు కలిసి, వీరు మళ్లీ ఇంకొక గేయ సంపుటి ప్రకటించారు.

### మూడవ దశ

ఈ సంపుటి ప్రకటించిన తరువాత ఇటీవల వీరు 'భారతి' మొదలైన పత్రికలలో మరికొన్ని గేయాలు ప్రకటించారు. ఈ గేయాలలో కొంత ఆధ్యాత్మికధోరణి బయలుదేరింది. వీటిలో ఇంతకుపూర్వం గేయాలలో ఉన్నంత కొత్తదనం లేకపోయినా, ఆధ్యాత్మికతతో మేళవించిన చక్కని భావపరిణతి గోచరించింది.

### గేయ ఫణితి

కవితా రచన వేరు. గేయ కవితా రచన వేరు. కవికికన్న గేయ కవికి ఇంకా కొన్ని గొప్పశక్తు లుండాలి. 'ఎంకి పాటలు' ప్రారంభించినప్పటినుంచీ మన వాఙ్మయంలో గేయ రచన బాగా వృద్ధిపొందింది. ఈనాడు గేయ కవుల సంఖ్యానంతులు. అయితే పరిణత అత్యుత్తమ గేయ రచయితలుగా ఎన్నదగినవా రయిదారుగురికంటె ఎక్కువ నుండి లేరు. శ్రీ సుబ్బారావుగారు వీరిలో ఒక ఆణిముత్యం.

మొదటనుంచి గేయరచనప్రక్రమించి నవ్వు డెందరందరో వీరిని నీరసంగా తీవ్రంగా విమర్శించారని అనుకున్నాము. అయినా ఈ ఉత్తమ కవి సహజమైన ఆత్మస్థైర్య విశ్వాసాలు వీరిని ఎన్నడు కోరవడలేదు. మొట్టమొదటి గేయ సంపుటిలోని ఈ చిన్ని గేయం దీనికి తార్కాణ:

"సాటేలా? నీకు మా సేలా
సిన్న తనమేలా? సిగ్గేలా?
"అన్నీను ఈ సీమ
అందరం దాలు
తీసంగ విసమూసి
దిద్దుకుంటారు!
"ముందు మనపాపణ్ణి
కింద దిగనీరు
రొంకి కోనంటారు
యెత్తుకోంటారు,
"యెంత కొక్కు నవత్తె
యేలి సెపంటారు!
ఇంటింటి సెపితారు
యెంకినీ సేను!"

కవివాక్కు తురకా యథార్థమై మారు మోగింది! నాటికీ నేటికీ ఎంకిపాటలు ప్రజాహృదయంలో మారుమోగుతూనే ఉన్నాయి.

### పాటల పేటిక

సుబ్బారావుగారి పాటలపేటికలో అన్నీ కలిసి సుమారు నూరుపాటలకంటె ఎక్కువ ఉండక పోవచ్చును! కాని యీపాటలు తెలుగుతల్లికలంకరించిన ఆణిముత్యాలహారాలు, వీటిలో కొన్ని ఉత్తమోత్తమాల తారకత్వం ఆంధ్ర జనని కంఠసీమలో ఆచంద్రార్కం గానిలచిపోగలదు! సుబ్బారావుగారి కవితా రచనస్వల్పమే కావచ్చును. కాని అది అమూల్యమయింది. అగుని కాంధ్ర కవితలో ఒక ప్రత్యేకమార్గమై నిలిచింది. ఆ విధంగా నండూరివారి జీవితానికి కొక ప్రత్యేక గణ్యత కలిగింది.

సుబ్బారావుగారు గేయ రచన ప్రక్రమించిన ప్రారంభంలో కొంద రాయన రచన సరికాదని ఈ పడించిన మాట నిజమే! అయితే ఆరోజుల్లో తమ కనేక విధాల ప్రోత్సాహ మిచ్చిన సహృదయుల నామధేయాలు కొన్ని వారు తొలిసంపుటి పీఠికలో పేర్కొన్నారు. వారిలో కొందరు సహృదయవదాన్యులు. మరి కొందరు కవిపుత్రులు. వదాన్యులలో కోకాడుని నాగేశ్వరరావు పంతులు, రాజా వెంకటాద్రి అప్పారావుగారు ప్రముఖులు. మొదటి సంపుటిలోని పాటలు చాలావరకు వేంకటాద్రి అప్పారావుగారి సన్నిధిలోనే రచించినామని సుబ్బారావు గారు ప్రత్యేకంగా పేర్కొన్నారు. వీరిద్దరు నాటికీ నేటికీ చిరస్మరణీయులే.

ఆంధ్ర దేశంలో ఎంకి పాటలు విని ఆనందించని వారుండరు. సుబ్బారావుగారా విధంగా ఆంధ్ర ప్రజా హృదయంలో సుప్రతిష్ఠులై అజరామరులైనారు. అనిఘంగా ఆంధ్ర ప్రజ ఇంతకు పూర్వమే వారికి గౌరవాదరాలందించింది. కవి కంటెకన్నా కావలిసినదే ముంది. సుబ్బారావుగారు ధన్యజీవనులు. అచిరకాలంలో వారి గేయ రచనలన్నీ ఒక పుస్తకరూపంలో వెలువడగలదని ఆశిస్తున్నాను.

# ప్రపంచ విఖ్యాతమైన మన గూర్ఖా సేవలు

['ఆంధ్రపత్రిక' ఢిల్లీ విలేఖరి]

"జూనియర్ కమీషన్ శ్రేణికి చెందిన ఒక గూర్ఖా ఉద్యోగిని, రాష్ట్రపతికి అంగరక్షకుడుగా నియమించడానికి భారతప్రభుత్వం అనుమతించింది. ఇప్పటికు అంగరక్షకులుగా ఉన్న ఇద్దరికితోడు ఈ గూర్ఖా ఉద్యోగిని నియమిస్తున్నారు." పత్రికలలో పడిన ఈ చిన్న వార్తను చూచినవారికి, భారత సైన్యంలో గూర్ఖాదళాల ప్రపంచవిఖ్యాతి అనేక యుద్ధరంగాలలో, అవి ప్రదర్శించిన శౌర్య సాహసాలు స్ఫురణకు రాకమానవు. భారత సైన్యంలో గూర్ఖాల ప్రతిష్ఠ అనన్యసామాన్యమైంది.

గూర్ఖాల జన్మస్థలం, పర్వత ప్రాంతమైన నేపాలుదేశం. జాతివీరత్వానికి పట్టుదలకు, శౌర్య సాహసాలకు, పెట్టిందిపేరు. గూర్ఖాదళా లేర్పడింది మొదలు అవి అనేక యుద్ధాలలో పాల్గొన్నాయి; బలపరాక్రమాలకు ప్రశంసా పత్రాలనేకం అందుకొన్నాయి. విజయ పరంపరతోకూడిన సుదీర్ఘమైన చరిత్ర వాటిది. వాటికవేసాటి. ఈ దళాలలో నవ గూర్ఖా రైఫిల్ దళం, బ్రిటిష్ సామ్రాజ్యపు యుద్ధచరిత్రలో అనితర సాధ్యమైన విజయాలుసాధించి ఐదు విక్టోరియా క్రాస్ లను బహుమతిగా పొందిది. ఒక్క రాయల్ వార్డర్ దళంతప్ప, మరి యేదళము, ఇన్ని విక్టోరియా పతకాలు పొందలేదు. రెండవ ప్రపంచయుద్ధంలో గూర్ఖాలు, భారత సైన్యం పాల్గొన్న పెద్ద యుద్ధరంగాలన్నింటిలోను, అమేయమైన శౌర్యసాహసాలతో పోరాడారు. ఈ యుద్ధంలో 12 విక్టోరియా క్రాస్ లు బహుమతి పొందారంటే, గూర్ఖాల ప్రతిభ ఎంతటిదో ఊహించవచ్చు. ప్రపంచదృష్టిలో వారి కీర్తి ప్రతిష్ఠలు మరింత ఇనుమడించాయి.

2వ గూర్ఖా రైఫిల్స్ దళం, ఇటలీలోని కాస్సినో ప్రాంతంలో అతి భయంకరమైన యుద్ధంలో పోరాడింది. గూర్ఖాలకు 17 ప్రశంసా పతకాలు లభించాయి. ఇటలీ యుద్ధరంగంలో పాల్గొన్న అనేక మిత్రరాజ్యాల సేనల్లో, జానీ గూర్ఖా అందరికీ కారకపాత్రుడయ్యాడు. నాజీలను ఇటలీనుంచి తరిమివేసే పర్యంతం, అన్ని పోరాటాలలో జానీ పాల్గొన్నాడు.

బర్మారంగంలో, 8వ గూర్ఖాదళం 'స్వర్గకరం' అనే 7వ భారత సేనావాహినిలో భాగంగా కోహిమా లగాయతూ, అడుగడుగునా భయంకరంగా పోరాటం సాగిస్తూ, ఐరావతిదాకా పురోగమించింది. 800 మైళ్లు యీ విధంగా అనుక్షణపోరాటంలో పురోగమించడంచూచి, "విరామ మెరుగని" గూర్ఖాలు అని పేరుపెట్టారు. ఈమాదిరిగానే 4వ గూర్ఖాదళం, ఉత్తరబర్మా తెలుమార్గాన్ని-మ్యాలీ దాకా - శత్రు విముక్తం చేయడంలో, అతి ప్రధాన పాత్ర నిర్వహించింది.

* * *

## ఆర్తత్రాణపరాయణులు

యుద్ధం ఏమీ లేకపోతే, సైనికులకు పనిఏమిటి? అని సామాన్యంగా జనం అనుకొంటారు. కాని భారత సైన్యానికి సంబంధించినంతమటుకు అది నిజం కాదు. భారత సైన్యంలోని ఉద్యోగులు, జవానులు యెప్పుడూ సైనిక శిక్షణ పొందుతూ ఉండడమే గాక, ఏదైనా ఆపదలు సంభవించినప్పుడు, అధికారులకు తోడుగా ప్రజాసేవలో పాల్గొంటూ వుంటారు. వరదలు, క్షామం, భూకంపాలు ఇత్యాది వచ్చినప్పుడు సైనికులు ప్రజల సహాయానికి వస్తారనే విషయం సాధారణంగా అందరికీ తెలిసిందే. కాని, అతి చిన్న సందర్భాలలోకూడా, మారుమూల గ్రామాలకు సైతం వెళ్ళి సైనికులు సహాయపడతారనేది ఆట్టేమందికి తెలియదు. ఇలాంటి సందర్భంలో ఒకటి చెబుతాను. ఇటీవల జమ్మూకు ఆరుమైళ్లలో ధూర్ అనేగ్రామందగ్గర కొండలోక శిబిరంలో అగ్నిప్రమాదం సంభవించింది. ఆ రాత్రంతా తుఫాను గాలి. మంటలు క్షణంలో శిబిరాన్ని చుట్టివేశాయి. అసలే పూరికొంపలు. దానికితోడు ఇంటిపై ఇల్లు, శిబిరం అంటుకొన్నట్లు కబురు తెలియగానే, ఆ పరిసరాల్లోవున్న సైనిక దళాలు 10నిమిషాల్లో శిబిరం చేరాయి. అంటుకొన్న యిళ్లకు ఆనుకొనిఉన్న ఇళ్ల పైకప్పులను ఎగరగొట్టి, మంటలు వ్యాపించకుండా చేసి 8 గంటలు శ్రమపడి మొత్తంమీద మంటలను అదుపులోకి తెచ్చారు. నిప్పుఅంటుకోకుండా రెండు ఇళ్లను పడగొట్టాల్సి వచ్చింది. ఆర్పడానికి నీళ్లు అందే దోవలేనందున, పారలతో మట్టి ఎగజిమ్మి మంటలు చల్లార్చారు. అడవులోచ్చి, సైన్యం యింత తంటాలు పడుతుంటే, మామూలు అగ్నిమాపక దళం, పటాటోపంతో శిబిరంలో అగ్నిప్రమాదం సంభవించిన గంటసేపటికి తీరిగా వచ్చింది. రగులుతూన్న ఇళ్లకు 500 గజాలలో, ఒక కొలనుదగ్గర పంపింగ్ యంత్రం అమర్చారు. తీరా నీళ్ళపంపు పెద్దామని ప్రయత్నించగా, అంటుకొన్న యిళ్లదాకా ఆ నీరు అందలేదు.

(6వ పేజీ చూడండి)

# వేటపాలెంలో జరిగిన నాటికల పోటీ

[శ్రీ ఉ. వి. వి. సాంబశివరావు]

మే 8వ తేదీ మొదలు 11వ తేదీ వరకు వేటపాలెం గ్రామంలో పాఠశాలావిద్యార్థిసంఘ యాజమాన్యన స్థానిక ఉన్నత పాఠశాల ఆవరణలో నాటికల పోటీలు నిర్వహింపబడినవి. వివిధసమాజములు పాల్గొన్నవి. నేను నాటికల కార్యక్రమమునకు 8 నుంచి 10వ తేదీవరకు హాజరయినాను. నాటికల ప్రదర్శనానంతరం ప్రేక్షకులు మొత్తం నాటికలలో, నటరాజ కళా సమితి (చీరాలవారు) ప్రదర్శించిన "తుఫాను" ఉత్తమముగాను, "ఆపడి" ద్వితీయశ్రేణిలో ఉన్నట్లు భావించినారు. నాకు నాటకకళ యందు యున్న అభిరుచివల్లను, నా స్వగ్రామమునందు నాటికల నిర్వహణ జరుగుచున్నదన్న అభిమానముతోను, ప్రస్తుతం నేను ఆ గ్రామములో ఉండనప్పటికి హాజరయినాను. నా అభిప్రాయము కూడ హెచ్చుమంది ప్రేక్షకులపై అభిప్రాయమునకు అనుగుణంగానే ఉన్నది. గాని 12వ తేదీన బహుమతుల నిర్ణయ కమిటీవారు నటరాజ ఆర్టు థియేటర్సు వేటపాలెం వారు ప్రదర్శించిన "తుఫాను" నాటికను ఉత్తమనాటికగా నిర్ణయించినట్లు విని నిర్ఘాంతపోయినాను. ఏట్టిపరిస్థితులలోను నిర్ణయాధికారులు ఆ అభిప్రాయమునకు వచ్చుటకు అవకాశము గాని, ఆస్కారము గాని లేదు.

"తుఫాను" నాటిక విషయములో చాలా ప్రధానమైన పాత్ర రాఘవరెడ్డిది. రచయితకూడా నెల్లూరువాసి అయివుండుటవల్ల ఆ ప్రాంతీయభాష, ఆచార వ్యవహారాలు పదిమందికి తెలియజేయు ఉద్దేశ్యమే అయివను "తుఫాను" రచనకు ప్రోద్బలము కలుగజేసినట్లు కనపడుచున్నది. రాఘవరెడ్డి పాత్ర అంతి ముఖ్యమైనది. మిగతా పాత్రలు అంత ప్రధానమైనవి గాక పోగా, రాఘవరెడ్డి పాత్రకు పూర్తి న్యాయము జరుగనిచో మిగతా పాత్రలు ఎంత సమర్థవంతముగా నటించినప్పటికి, నాటిక ఉత్తమముగా తయారగుటకు ఆస్కారము లేదు. ఇట్టిస్థితిలో చీరాల నటరాజ కళాసమితివారు ప్రదర్శించిన "తుఫాను" నాటికలో రాఘవరెడ్డి పాత్రధారి అయిన శ్రీ సి. పేటి వెంకటాద్రిగారినీ, ఉత్తమనటునిగా నిర్ణయించి వ్యక్తిగతంగా సన్మానించుచూ వేటపాలెం నటరాజ ఆర్టుథియేటర్సు వారు నిర్వహించిన 'తుఫాను' నాటికను ఉత్తమప్రదర్శనగా నిర్ణయించుట పూర్తిగా అసహజమైన పని. ఈ నిర్ణయానికి తోడ్పడిన కారణాలు పలాభిమానము, గ్రామాభిమానము ప్రధానముగా ఉండుట మినహా యితర సమంజసమైన కారణములు నిర్ణయాధికారులకు స్ఫురించుటకు అవకాశము లేదు. రాఘవరెడ్డి పాత్రయే కాక, ఇతర పాత్రలుకూడా చీరాల నటరాజ కళాసమితివారు కవి అభిప్రాయమును బాగా అర్థముచేసుకొని, పాత్రధారణ, పాత్రపోషణ చేసినారు. ఇది ఇలా ఉండగా వేటపాలెం నటరాజ ఆర్టు థియేటర్సువారు కథలోని పాత్రలను కవి అభిప్రాయమును అర్థము చేసుకొనలేదు సరిగదా. కవిగారు ఏ ఉద్దేశ్యముతో నాటికను రచించినారో, ఆ విషయమును పూర్తిగా విస్మరించి కవిగారికి కూడా చాలా అన్యాయము చేసినారు. ఇట్టి పరిస్థితులలో నిర్ణయకమిటీవారు వేటపాలెం నటరాజ ఆర్టు థియేటరు తుఫాను నాటికను ఉత్తమముగా నిర్ణయించారంటే, వారికి నాటక కళయందున్న అభిరుచి ఎంత చక్కగావున్నదో తెలుస్తుంది. ఈ సందర్భములో ఒక చిత్రమయిన విషయము ఉదహరిస్తాను. 8వ తేదీనాడు వేటపాలెం నటరాజ ఆర్ట్సు థియేటర్సువారు నాటిక ప్రదర్శింపబోవుముందు, ప్రేక్షకుల స్టేజి దగ్గర స్థానములో నిర్ణయాధికారుల పక్కనే నేను కూర్చొనియుండగా ప్రేక్షకులలో ఒకరు నిర్ణయాధికారులను, నాటికను లోగడ ఎప్పుడైయినా చూచినారా, పుస్తకం చదివినారా అని ప్రశ్నించగా లేదని సమాధానము చెప్పినారు. అప్పుడే, నిర్ణయాధికారులు వారికి యివ్వబడిన అధికారము సక్రమముగా వినియోగపరుస్తారో లేదో అని అనుమానము నాకు కలిగినది. నా అనుమానములు నిర్ణయము విన్న తరువాత ధృవపడినవి. ఇంతవు పత్రికాముఖమున నేను ఈ అభిప్రాయములు తెలియపరచుటకు ప్రధాన కారణము ఏ సమాజము వారయినా యికముందు నాటికల పోటీలలో పాల్గొన దలంచుకొన్నచో ముందుగా నిర్ణయాధికారు లెవరో తెలుసుకొని వారి సమర్థత న్యాయదక్షత విచారించిన తరువాత గాని నాటికల పోటీలలో పాల్గొనకూడదని సలహా యిస్తున్నాను. ప్రస్తుత నిర్ణయాధికారుల అన్యాయప్రవర్తనవలన వేటపాలెం గ్రామము సారస్వతము లలితకళలయందు సంపాదించిన పేరు ప్రతిష్ఠలకు తీరని కళంకము కలిగినదని చెప్పకతప్పదు.

# సహకారోద్యమాభివృద్ధికి ప్రయోగ పథకాలు

[శ్రీ ఓగిరాల వెంకటసుబ్బారావు]

గత 50 సంవత్సరాలుగా భారత దేశంలో సహకారోద్యమం 100 కి మూడువంతులకన్నా ప్రజలకు తోడ్పడ లేకపోయిందని, రిజర్వుబ్యాంకువారిచే నియోగింపబడిన గ్రామార్థిక పరిశీలన కమిటీవారు తాము తయారుచేసిన నివేదికలో ప్రకటించారు. ప్రభుత్వసహాయంకూడా యింతింత మాత్రంగానే వున్నదనికూడా ఆ నివేదిక ఉదహరిస్తూ దేశార్థికవిధానం ముఖ్యంగా గ్రామార్థికవిధానం అధిక సంఖ్యాకులైన గ్రామీణ ప్రజానీకానికి ప్రధాన వృత్తియైన వ్యవసాయానికి ప్రయోజనకారిగా వుండాలంటే సహకారోద్యమవిధానం పూర్తిగా మారవలసి వుంటుందని కొన్ని సూచనలనుచేశారు. కమిటీవారు అందచేసిన నివేదికను 1955 ఏప్రిల్ లో ఢిల్లీలో సమావేశమైన రాష్ట్రమంత్రుల సభవారు ఆమోదించారు.

గ్రామార్థిక పరిశీలక కమిటీవారి సూచనలు స్థూలంగా యివి:

(i) సహకార పరపతి, మార్కెటింగు, ప్రొసెసింగు, నిలవ వసతులు ప్రభుత్వభాగస్వామ్యంతో నిర్వహింపబడేటట్లు పునర్నిర్మాణం కావాలి;

(ii) దీనికి ప్రాతిపదికగా విశాల సహకార సంఘాల నిర్మాణం జరగాలి;

(iii) ఇప్పుడు చిన్న చిన్న విగాను, నీరసంగానువున్న గ్రామ ప్రాథమిక సంఘాలనుకలిపి పరిమితపూచీపై పరపతి సంఘాలుగా యేర్పాటు చెయ్యాలి. పతే, బాగా పనిచేస్తున్న యిప్పటి ప్రాథమిక గ్రామ పరపతి సంఘాలను విశాల సహకార సంఘాలుగా మార్చాలనే నిర్బంధం యేమిలేదు;

సభ్యత్వంలో నేమి, మూలధనం విషయంలో నేమి, వ్యాపార వాటాన్ని బట్టియేమి, పాంతీయ ఫోటుకంలో నేమి యిప్పటి సంఘాలలో చాలవరకు యేమాత్రమూ తృప్తికరంగా లేవు. ఇప్పటి గ్రామ ప్రాథమిక సహకార సంఘం సభ్యత్వం సాధారణంగా 50 కి మించలేదు; వీటిలో మళ్ళీ సంఘం నిర్వాహక గౌరవాభిమానాలు కలవారి సంఖ్య బాగా తక్కువ. సామాన్య సంఘం వాటాధనం రూ. 1000 లకు మించలేదు. రూ. 50 లకు మించియే సభ్యునికి అప్పు మంజూరు లేదు. అప్పులు పొందేసభ్యులు కూడా భూస్వాములు, సంపన్న కుటుంబీకులే.

అందుచేత పునర్నిర్మాణానికి తలపెట్టబడిన మొదటి సోపానం సంఘ స్వరూపంలో మార్పు. పైన చెప్పిన విధంగా యేర్పాటయ్యే విశాల సహకార సంఘాల వ్యాపారవిస్తీర్ణం, 8 మొదలు 10 గ్రామాలవరకు విస్తరిస్తుంది. తద్వారా యీ గ్రామాల్లోవుండే ప్రతి కుటుంబానికి యీ సంఘంలో ప్రాతినిధ్యం లభిస్తుంది. ఇట్టి సంఘం వాటాధనం రూ. 20,000 లు వుంటుంది. ప్రతి సభ్యునికీ కనీసం రూ. 100 లైనా అప్పుదొరికే విధంగా సంఘ ఋణాధికారం పెరుగుతుంది. పేదరైతులకు, కౌలుదార్లకు కూడా సహకార పరపతి సహాయం అందుబాటులో వుండేందుకు ఋణం పొందే అర్హతలో మార్పుచెయ్యబడింది. అప్పుకోరే సభ్యుడు భూస్వామి కానక్కరలేదు. పండేపంట మొత్తాన్నిబట్టి వచ్చే ఆదాయాన్నిబట్టి, అవసరాన్నిబట్టి, సభ్యుని నిజాయితీనిబట్టి ఋణం ఇవ్వడం నిర్ణయింపబడుతుంది. ఇటువంటి సంఘాలు 1960-61 సంవత్సరాంతానికి 10000 నెలకొల్పడానికి ప్రభుత్వం నిర్ణయించారు.

ఈ పునర్నిర్మాణ పథకంలో రెండవమెట్టు ప్రతి వ్యాపారకేంద్రంలోను మార్కెటింగు సంఘాల స్థాపన. పంట పండించినంతమాత్రాన సరిపోదు. ఆ పంట ఉత్పత్తిదారునకు లాభసాటిగా అమ్ముడుపోయినప్పుడే, ఉత్పత్తికి చేసిన సహాయం రాణిస్తుంది. అందుచేత ప్రతి మార్కెటింగ్, లేదా వ్యాపార కేంద్రంలో ఒక్కొక్క గోడౌనును, స్వంతంగాగాని, అద్దెకుగాని సంపాదించి ఆ గోడౌనులో సభ్యుని తాలూకు పంటను నిలవచేసి, ధర లాభసాటిగా వున్నప్పుడు అమ్మిపెట్టడానికి ఈ మార్కెటింగు సంఘం కృషిచేస్తుంది. వ్యాపారంలో రైతుకు తన పంట లాభసాటి విక్రయానికి ఎక్కువ సాధ్యాలున్నప్పుడే అతని శ్రమకు ఫలితం దక్కుతుంది. ఎక్కడెక్కడ ధరలు యేవిధంగా వున్నవి, ఎక్కడ అమ్మితే లాభించేది కనుగొని అక్కడికి సరుకును యేలా రవాణా చేసుకునేది తెలిసివుండాలి. అంతేకాక, పండినపంటను వెనువెంటనే అమ్మజూపితే అంతగా లాభించక పోవచ్చును. కాబట్టి ధర లాభసాటిగా వుండేవరకు పంటను నిలవచేసుకోవడం ఉత్తమం. పండినపంటను పండినట్లుగానే అమ్మేదానికన్న ముడిస్వభావాన్ని పారిశ్రామికంగా మార్చి వాడకానికి తయారుచేస్తే (ప్రోసెసింగు) యింతకన్నా లాభించవచ్చును. ఉదాహరణ: ధాన్యం బియ్యంగాను, ప్రత్తిని నూలుగాను, నూనెగింజలను నూనెగాను చెరుకును బెల్లం లేదా, చక్కెరగాను మార్చి విక్రయిస్తే, రైతుకు అధికతర లాభం రావడానికి అవకాశం యెక్కువుంది. అనగా, పండించేవారికి వస్తువు ఉపయోగానికి సంబంధించిన దేశకాల ప్రాంతీయ పరిచయజ్ఞానం పూర్తిగా వుండాలి. కాబట్టి, సహకారాభివృద్ధి పునర్నిర్మాణ ప్రణాళికలో మార్కెటింగు సంఘాలు, ప్రోసెసింగుకు అవకాశాలు కల్పించాలి.

మూడవమెట్టు సహకార సంస్థల వాటాధనంలోను, పరిపాలనా విధానంలోను, ప్రభుత్వానికి భాగస్వామ్యం. ముందు ముందు సహకార సంఘాలూ, ప్రభుత్వమూ తమతమ నిధులను యేకంచేసుకుని భాగస్వామ్యంతో నడవవలసి వున్నాయి. సహకార సంఘాలు ఆర్థిక జవసత్వాలను ప్రభుత్వం నుండి పొందుతూ వుండడానికి, సంస్థల నిర్వహణలో తక్కువ ఆదాయాలు కలవారి ధరవును పూచీ వహించడానికి ప్రభుత్వం భాగస్వామ్యానికి అంగీకరించింది.

పతే, పైనుండి యెంత సహాయం అందినా ప్రజలలో ఆత్మావలంబన జ్ఞానం ఉండకపోతే ఈ చేసినదంతా వృథా అయిపోతుంది. పేకముక్కలలో మేడ కట్టినట్లేవుంటుంది. ధనం యివ్వవచ్చు; సంఘాల రిజిస్ట్రేషనుకు వసతులు కల్పించవచ్చు; నిర్వహణకు సుశిక్షితులైన సిబ్బందినికూడా సమకూర్చవచ్చు. ఎంతచేసినా ప్రజలలో ఆకాంక్షలు లేకపోతే, ఇదంతా నిష్ఫలం. ముందుముందు నిర్మాణంలో నేమి, నిర్వహణంలో నేమి, పురోగమనంలో నేమి ప్రజల చొరవ యెన్నో లనుపట్టవలసిన అవసరం యెంతేనా వుంది.

పాత పద్ధతిలో వడ్డీ లాభం లేదు. సభ్యుడు తీసుకున్న అప్పు సాగుబడికే వినియోగిస్తున్నాడని కాని పండిన పంటను మార్కెటింగు సంఘం ద్వారా తప్పకుండా అమ్ముతాడని కాని తెలియని ఋణదానం చేసి లాభం లేదు. అటువంటి అలా చేసినప్పుడే ఈ పునర్నిర్మాణం ప్రయోజనకరం అవుతుంది. సభ్యులలో బాధ్యతలను, విశ్వాసాన్ని మాటలలోను పాటలలోను సాధించడం కష్టం. ఈ కష్టసాధ్యమైన పరివర్తనాన్ని ప్రజానీకంలో యేనాడు తేగలుగుతామో, ఆనాడు ఈ కృషి సఫలీకృతమవుతుంది. భారత సహకారం ప్రపంచ సహకారానికి ఆదర్శప్రాయమౌతుంది.

ఈ సంఘటిత సహకారాభివృద్ధి విధానం మన ఆంధ్ర ప్రాంతంలో మూడు జిల్లాలలో ప్రయోగింపబడుతోంది. దీనికి సంఘటిత గ్రామార్థిక ప్రయోగపథకం అని పేరు. ఇది విశాఖ జిల్లా అనకాపల్లి యెలమంచిలి తాలూకాలలోను, పశ్చిమ గోదావరి తాడేపల్లిగూడెం యేలూరు తాలూకాలలోను కర్నూలు జిల్లా ఆదోని, ఆలూరు, పత్తికొండ తాలూకాలలోను ప్రయోగంలో వుంది. ఈ ప్రాంతాలన్నీ కమ్యూనిటీ డెవలప్ మెంటు జాతీయ విస్తరణ బ్లాకులక్రిందనున్నవే. ఇంతవరకు రాష్ట్రంలో 782 గ్రామాలను యేరి, వాటికి వర్తించేట్టు 88 విశాల సహకార సంఘాలు నెలకొల్పబడ్డాయి. ఈ సంఘాలకు వాటాధనంగా పెట్టుబడి పెట్టడానికి రిజర్వు బ్యాంకు వారు రు 10.67 లక్షలను రాష్ట్ర ప్రభుత్వానికి అప్పుగా యిచ్చారు. ఈ మొత్తంలో నుండి రూ 6.26లక్షలు 69 సంఘాలకు వాటా

(6 వపుట చూడుడు)

# సరళ సంస్కృతం

## పాఠము 22

### తత్, శబ్దము - ఏకవచనములు

| | పుంలింగము | స్త్రీలింగము | నపుంసకలింగము |
|---|---|---|---|
| 1. | సః=వాడు | సా=ఆమె | తత్=అది ప్ర. వి. |
| 2. | తం=వానిని | తాం=ఆమెను | తత్=దానిని, ద్వి. వి. |
| 3. | తేన=వానిచేత, తో | తయా=ఆమె చేత, తో | తేన=దానితో, చేత, తృ. వి. |
| 4. | తస్మై=వానికొఱకు, కై | తస్యై=ఆమె కొఱకు, కై | తస్మై=దానికొఱకు, కై చ. వి. |
| 5. | తస్మాత్=వానివలన, కంటె | తస్యాః=ఆమె వలన, కంటె | తస్మాత్=దానివలన, కంటె పం. వి. |
| 6. | తస్య=వానియొక్క, కి, (వానిది) | తస్యాః=ఆమెయొక్క, కు, (ఆమెది) | తస్య=దానియొక్క, కి, ష. వి. |
| 7. | తస్మిన్=వానియందు | తస్యాం=ఆమెయందు | తస్మిన్=దానియందు, స. వి. |

క్రింది వాక్యముల నభ్యసింపుడు:

(1) సః తత్ర కింకరోతి? (2) సః తాం ఆనయతి (3) సా తం పశ్యతి (4) తేనసహ అహంగచ్ఛామి (5) తయా సాకం బాలకః భోజనంకరోతి. (6) బాలికః తస్మై కందుకం యచ్ఛతి (ఇచ్చుచున్నాడు) (7) అహంతస్యై పుష్పంయచ్ఛామి (ఇచ్చుచున్నాను.) (8) తస్యకిమపి భోజనం నాస్తి (9) తస్యాః పుత్రాః అత్ర వసంతి (10) తస్మిన్ గ్రామే కృషికాః నివసంతి.

క్రింది వాక్యములను తెనుఁగులోని కనువదింపుఁడు.

(1) వానికి పుత్రులు లేరు. (2) ఆమెకు పుత్రికలు లేరు. (3) ఆమెతోకూడ ఆమెయొక్క కుమారుడు భోజనముచేసి ఆడుకొనుటకై వెళ్ళుచున్నాడు. (4) అందువలన (తస్మాత్) వానిని అంగరు చూచుచున్నారు. (5) ఆబజారునందు బంగాళదుంపలు అమ్ముచున్నారు. (6) ఆమె పుష్పములను తీసికొనివచ్చుటకై ఉద్యానమును గూర్చి వెళ్లి పుష్పములనుచూచి అక్కడ ఆడుచున్నది. (7) రాముఁడు వానితోకూడ ఆడుకొనుటకై వచ్చి పాఠములను చదువుచున్నాడు. అది (తత్) చూచి ఇంటికి వెళ్ళుచున్నాడు. (8) ఆ పుష్పము వానిది. (9) ఈపంటు నాది. (10) నేను వాడు ఆమెయు ఇక్కడనే వానినిచూచి పండ్లను, పువ్వులను కొనుచున్నాము.

సూచన:—'తస్మిన్ గ్రామే, అనుచోట గ్రామమునకు 'తస్మిన్, అనునది విశేషణమని తెలియవలెను. ఇచ్చట గ్రామ శబ్దము సప్తమీ ఏకవచనము నందున్నందున 'తత్, శబ్దము కూడ సప్తమీ ఏకవచనమునందే యున్నది. సంస్కృతభాష యందు విశేష్య విశేషణములు ఒకే విభక్తి, ఒకే లింగము, ఒకేవచనము నందుండవలెను. 'రామః, అనునప్పుడు 'సః రామః, అనియు, 'సీతా, అనునప్పుడు 'సాసీతా, అనియు 'పుష్పం, అనునప్పుడు 'తత్ పుష్పం, అనియు ప్రయోగింపవలెను. సంస్కృత భాషా రచనమునందు ఈ నియమము తప్పక పాటింపవలెను. మున్ముందు ఈ నియమ ప్రకారమిచ్చు అభ్యాసములను శ్రద్ధగా గమనింపుడు.

[సంస్కృత విశ్వపరిషత్తు ప్రేరణతో భారతీయ విద్యాభవన్ వారునిర్వహిస్తున్న సరళసంస్కృత పరీక్షలకోసం ప్రచురించిన పాఠాలకు అనుగుణంగా శ్రీ నుదురుపాటి వెంకటరమణ శర్మ, తొయ్యేటి భానుమూర్తి (సంయుక్త కార్యదర్శులు-ఆంధ్రప్రదేశ విద్యాపరిషత్తు సూర్యారావుపేట, విజయవాడ.2) వ్రాసిన పాఠాలు.]

# తెలుగువారి పుస్తకవ్యాసంగం -ఒకనాటి మాట

ఇంకా కొన్ని గ్రామాలలో ఇలాటి మనిషి కనపడుతూనే ఉంటుంది- కుంకుమా, సూదులూ, అద్దాలూ, దువ్వెన్లూ, సబ్బులూ అమ్మే అమ్మాయి! పల్లెటూళ్ళలో నాగరకత వెదజల్లింది, ఈ శతాబ్దంలో ఈవిడే.

అలాగే ఈ నాగరకతను వ్యాప్తిలోకి తెచ్చిన మూగా దొరకదున్నాడు- ఇంగావిపంచ ఒక్కపక్క పైకి తోసి మరొకపక్క వదిలి, నెత్తిన ఒక పెట్టె పెట్టుకొని, కత్తెర్లు, చాకులు, కళ్ళజోళ్ళు గోల్డుగోల్డు పిన్నీసులు సుందీలు, పుస్తకాలు అమ్మేవాడు. చెంగావి పంచె గూడకట్టు అయిపోయి వుండవచ్చు— ఆ మనిషి అసలు కనపడుతున్నాడో లేదో ఆరా తీయాలి.

బస్తీలలో సైనమాలోనూ బస్సులాగే చోటా తిరునాళ్ళలో ఇతగాడు ఇప్పుడూ కనపడ్తాడు, ఒట్టి పుస్తకాలు మాత్రం అమ్ముతూనూ.

విని ఉంటారు—

"ఆ! నవలలండీ—వక్కాల వారివి, వంజావారివి. కృష్ణశతకం, దాశరథీ శతకం, రామలింగేశ్వర శతకమండీ—ఆ! కొనుక్కోండమండి!" — అని అతగాడు ఎక్కిపెట్టి దిగేపెట్టి, ఎదురొచ్చే మనిషీ, ఎదురు తప్పించుకునే మనిషీ — ఇలా ఉంటుంది.

## ఇంటింటికీ గ్రంథాలు

పూర్వం వీళ్ళే చౌకగా ఇంటింటికీ గ్రంథా లందించారు. పుస్తకాల పేర్లు వల్లిస్తూ ఊళ్ళ వెంటనే తిరిగేవారు. పెద్ద అచ్చులో కృష్ణశతకం, సుమతీశతకం, రామశతకం వగయిరాలు-అన్నట్లు పెద్దబాలశిక్ష, కాశీమజిలీలూనూ. చిన్న అచ్చులో ప్రబంధాలూ అమ్మేవారు.

శతకాలు ఒక్కొక్కటి అణాలోపు. కృష్ణశతకం కానీయో అర్ధణానో ఉండేది. ఆ పుస్తకాలమీద ధర ఉండేది కాదు. ముద్రాపకుని విలాసం ఉండేది. చిన్న పుస్తకాలకు (పెద్దఅచ్చువి)అట్టా కూడా ఉండేది కాదు. పెద్ద పుస్తకాలకు (చిన్న అచ్చువి) అట్ట ముక్క ఉండేది. అన్నీ చౌక. ఆ పుస్తకాలు వేసిన వాళ్ళకు ఎలా గిట్టేదో, ఏమి మిగిల్చేదో, యీ అమ్మే వాడికి ఏమి ఇచ్చేవారో తెలియదు. ఊళ్లో కొందరు ఏ సావిట్లోనో వక్కామంచాల్లో కూర్చొని వాటిని పారాయణచేస్తుంటే, మిట్టమధ్యాహ్నం వేళ ఎండలో నీ రెండలాగా ఉండేది.

మొత్తానికి అది పెద్దవ్యాపారం అయి ఉండదు. మంచిపుస్తకాలూ వచ్చేవి, మంచివని ఎవ్వరూ చెప్పుకోని పుస్తకాలూ వచ్చేవి.

## గుజిలీలో మజిలీ

చాలా ఇళ్ళల్లో ఏ అటకమీదో, ఏ పాత కావిడిపెట్టెలోనో పిచుకాగితాల పుస్తకా లుండటం అందరూ ఎరిగే ఉంటారు. వాటిని గుజిలీ పుస్తకాలు అంటారనుకుంటాను. గుజిలీ అంటే బజారుకదూ, బహుశా-లాటూను పుస్తకాలుగా చాలా స్వల్ప సంఖ్యలో ఉంటున్న గ్రంథాలు బజారుకు ఎక్కువ అధికసంఖ్యలో రావడంవల్ల గుజిలీ పుస్తకాలై ఉంటాయి. పెద్దబాలశిక్ష గుజిలీ పుస్తకం చాలామంది చూసే ఉంటారు. ఎంత బజారు కెక్కినా ముద్రారాక్షసాలు ఉండేవి కావు-రచనారాక్షసాలు లేక పోవడం వల్ల అయిఉండవచ్చు. అంతకుముందు సుబ్బరంగా చేత్తో వ్రాసుకొనడమే అలవాటుకాబట్టి, ఆ అలవాటు అచ్చు కూర్పరికీ, అచ్చుయంత్రానికీ కూడా ఎక్కువుంటుంది.

ఆ తర్వాత 'మేలుప్రతి' యుగం రోసుకొచ్చింది. నానాదేశపు ప్రతులూ పాఠాంతరాలూ పండితులచే చక్కగా పరిశోధింపబడి ధలాసావారిచే ముద్రింపబడినది-అని ఆ ధలాసావారి విలాసం వారి అభిమాన జేపునికి నమస్కారంతో పాటు ముద్రించేవారు. ఉద్గ్రంథాలన్నీ ప్రచురించారు. అప్పటికింకా అచ్చు తప్పుల యుగం ప్రవేశించలేదు.

## అచ్చుకవాట్ఫరి

అచ్చుకూటాల అసాములు పండితులకు ప్రతిఫలం ఏమి ఇచ్చేవారో తెలియదుగానీ, సెలవిచ్చం అనిచెప్పి పండితులకు దైన్యభయిదు రూపాయల మంచి మాటయా శైదాకా(ఆరోజుల్లో) ఇచ్చి, శుద్ధప్రతులు తయారుచేయించే వారు. అచ్చుకూర్పరికూడా ఆ వ్రాసినదంతా విగ్రహగాఢ భక్తితో చదువుకొని... నామాలుకూడా ఆశ్చర్యపడేటట్లు-మరీ, కూర్చుకు దిగేవారు, తాపీగా. శుద్ధప్రతి తయారీలో పండితుడూ, కూర్పరి, ఇద్దరూ శ్రద్ధ పుచ్చుకునేవారే. ఆ కూర్పరికీ, కూర్పినవన్నీ నోటికి రావలసిందే.

పాతిక ముప్ఫైఏళ్ల క్రిందటివరకూ తెలుగు ముద్రణావ్యాసంగం మద్రాసులోనే హెచ్చు. పాతచాకలిపేట, చిన్నతంబివీధి, సావుకారుపేట, కృష్ణప్పనాయక అగ్రహారం, వగైరా పేర్లు ఆ గ్రంథాలతో పాటు ప్రతి తెలుగువాడి నోటికీ వచ్చాయి. శతకాలు, దండకాలు, కథలు, పాటలు - అన్నీ అక్కడనుంచి పుట్టుకొచ్చేవి. ముద్రాపకుల పేర్లుచూస్తే నాయుళ్లూ, వైశ్యులూ కనపడతారు.

ఇందులో అనేకులు ద్రావిడ ప్రబంధాలు అనువదింపజేసి ముద్రించారు; చౌకగా అమ్మించారు.

అసలు ఆరోజుల్లో ఒక మంచి ఆచారం ఉండేది. కలవారి పిల్లాడికి అక్షరాభ్యాసంచేసి బడికి పంపేవాడు, బడిలో అతడి సహాధ్యాయులందరికీ పప్పు బెల్లాలతోపాటు మంచి పలక (అణా), బలపం (కానీకి ఆరు), బాల రామాయణం (కానీ), సుమతీశతకం (కానీ), పెద్దబాలశిక్ష (అణా), పంచేవాడు.

పుణ్యం అంటే ఏమిటో మన కెందుకుగానీ, ఆ ఆచారం మాత్రం మహా దొడ్డగా ఉంది.

## కస్తూరిమాత్రలు-పుస్తకాలు

ఆరోజుల్లో - అంటే ముప్ఫైఏళ్ల నాటిదాకా— పిల్లలుగలవారికి వంటాముదం సీసా, కస్తూరిమాత్రలు ఇవ్వడం ఎంత సదాచారమో, చదువుకున్న వారికి పుస్తకాలు ఇవ్వడమూ అలాటి సదాచారమే. కలిగినవారు అనేకులు ఆలా చేసేవారు. వారికి నష్టంవిమీ రాలేదు.

పండితులే పాతగ్రంథాలకూ శుద్ధప్రతులు తయారుచేసేవారు; అచ్చు పొరపాట్లనూ దిద్దేవారు. అచ్చుకూర్పరికీ పండితునికీ సాన్నిహిత్యం. ముద్రాపకులు, ఇతర పెద్దలూ పుస్తకాలు బహూకరిస్తూ ఉండేవారు. అధవా కొన్నా, చౌక. నూరు శతకాలూ ఒక రూపాయి. దండకం ఒక కానీ! లంకా యాగం, సీతమ్మ సమర్త, ఊర్మిళా దేవి-నిద్ర ఒక కానీ!

అచ్చువచ్చినతర్వాత కూడా పురోహితులు, పారాయణలు చేసేవారూ, మడికోసమండి, మరేదైనా అనండి, తాటాకు గ్రంథాలనే వాడేవారు. అచ్చుపుస్తకాలను వాడేవారు, దారంలో కట్టని పుస్తకాలను అట్టల్లోపెట్టి నారపట్టుగుడ్డలో చుట్టిపెట్టుకు నేవారు. మరి "గ్రంథాలయాల ఆచార్యః" అంటే ఇదే నేమో! ఏమైనా, నార (అరటి) పట్టుకు చెదపట్టదు. అదీ ఒక మేలే!

అచ్చుపుస్తకాలు వచ్చినతర్వాత కొంతకాలంపాటు, ఆ అచ్చు పుస్తకాలు వేశ్యల ఇళ్లలోనే దొరికేవి! (అందువల్లనే వారికి త్వరగా సంస్కారం సాధ్యం అయిందనుకుంటాను) బహిరంగంగా వేసిన ప్రబంధాలూ, చాటుగావేసిన శృంగార గ్రంథాలు ప్రతి ఘరానా వేశ్య ఇంటా ఉండేవి. ఘరానా వారు తీసుకొని చదువుకు నేవారు. ఒకరికి శృంగారం హెచ్చింది. ఒకరికి రాను రాను తగ్గింది.

## శృంగారం

శృంగారగ్రంథాలకు రహస్యజీవనం కలగడానికి కారణంగా ఒకకథ ప్రచారంలో ఉంది. ఆ రోజుల్లో అనేకులు ఆంగ్లేయులు తెలుగులో శ్రద్ధవహించారు. తెలుగు పండితులద్వారా అర్థాలు తెలుసుకునేవారు. వారు చెప్పినవి వ్రాసుకునేవారు. తీరా ఆ తెలుగుపండితులు తెమరునన పడిపోయారు! అది వేరుమాట. ఇంతకూ ప్రభుత్వ అనువాదకుడు ఒకాయన ఒక శృంగార గ్రంథం చూసి, తాను దాన్ని ఎంత పదిలం చేసినా ఆ తాయిలాన్ని తనభార్య చదివి వట్టి 'లోలి' అయిపోయిందని భ్రమసి, శృంగార గ్రంథాలను దొరలచేత నిషేధింపజేశాడట. తీరా 'పెళ్లాం' అయినా విద శృంగార గ్రంథాలు చదివి 'లోలి' కానక్కరలేదు కాబట్టి, ఈ కథను నమ్మవద్దందాం. కానీ జరిగిన విషయం మాత్రం, శృంగార గ్రంథాలు అనేకం (పాశ్చాత్యగ్రంథాల అనువాదాలు, బొమ్మలుతో సహా) గుజిలీ పేర్లలో అచ్చు అయి, పడకిళ్ళల్లోకి సరాసరి రవాణా అయ్యేవి. ఈ నాటికీ!

గత శతాబ్దం చివరలో, చెన్నపట్నంలో వేదం వెంకటాచలయ్యగారనే మహాపండితుడు తెలుగు అక్షరాలకు అచ్చులు దిద్దుతూనే ఉన్నారు. స్థాయిగల సాహిత్య గ్రంథాలను వెలువరించడానికి భక్తిగల వర్తకులు కృషి చేస్తూనే ఉన్నారు. ఈలోగా శృంగార గ్రంథాలు మాత్రం రాపాగాయి; అమ్ముడు పోసాగాయి!

అచ్చు చరిత్రలో అదొకశృంగారం, కానీ అచ్చుచరిత్రలో నవరసాలూ పుష్కలంగా లభ్యస్తాయి. ఏమైనా పుస్తకాలను నిర్దుష్టంగా, పిచుకాగితం మీదే అయినా, వేయడం, చౌకగా అమ్మడం ఆరోజుల్లో చేశారు. ఏ వర్తకునికి అవర్తకమే ధర్మసంస్థ.

## పంచాగ్నుల కల

స్వర్గీయ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు ఒక ముద్రాక్షరశాలలో పండితులుగా పనిచేశారు. పండితుడంటే, అచ్చుకూర్పు తప్ప మిగతా పనులన్నీ చేసేవ్యక్తి. భారికి, 1920 ఆ ప్రాంతంలో సంగతి, ప్రబంధాలు పురాణాలు చౌకగా ముద్రించి అమ్మించాలని సంకల్పం — ఆహ్! — స్వప్నం! ఇంట్లోనే అచ్చుకళ్లు పెట్టుకొని, మిగిలిన భాగాలలోనే సంసారం. ఈ చిన్న ముద్రణాలయంలోనే 'జయంతి' పత్రికను వేశారు! పాపం! ఆదినారాయణ శాస్త్రిగారి కల నిజం కాలేదు. కలలు నిజమే అవుతే వాటి స్వారస్యం పోతుందేమో!

## పూర్ణయాచార్లు

పూర్ణయాచార్లుగారనే ఒకవ్యక్తి ఉండేవారు బందరులో పోలీసు (ఇన్‌స్పెక్టరుగారి) రైటరు (గారు). ఆరోజుల్లో పట్నాల్లోకూడా అది ఒక మహాహోదా, కరణం మునసబు గిరీల్లాగా. ఇది డెబ్బైఏళ్ళనాటిమాట. పూర్ణయాచార్లుగారు పెద్ద సాహితీ పరుడు కాదు. పద్యాలంటే సరదా. సాహిత్యం అంటే పవిత్రమైనదని ఒక విశ్వాసం గలవాడు. ఆనోటా ఆనోటా విన్నవీ, సాధువులు పాడినవీ, వాళ్లూ వీళ్లూ చెప్పినవీ, అన్నీ మొత్తం 2500 పైగా వేమనపద్యాలు సేకరించి ఒక పుస్తకం వేశారు. వట్టి నిష్కామకర్మ. కాకపోతే, అతడు దానిని వర్తకం కింద సాగించి ఉంటే, చివరకు దైన్యంలో చనిపోవలసివచ్చేదికాదు— అతని తల్లి కష్టపడి అతనిని పోషించ వచ్చేదికాదు — అతని తల్లి కష్టపడి అతనిని పోషించవలసి వచ్చేది కాదు అతడు వేసిన వేమన పద్యాల పుస్తకమే తర్వాత వారి పరిశోధనలకు ఎంతో సహాయపడింది. అతడి స్మారక చిహ్నంగా, చౌకగా ఒక వేమనను వేస్తే బాగుండును.

ఆ బందరులోనే మరొకదిట్ట, శృంగారపు గ్రంథాలు వేసేవాడు. నవ్వుల తోట అని ఒక హాస్య పత్రికనుకూడా పెట్టాడు. అతడు చేసిన పనులు చాలా చోద్యంగా ఉంటాయి. పుస్తకాలను బెజవాడకు చేర్చడం అతడి ప్రథమ సమస్య. బస్సుల్లో మనిషికి రెండున్నరపైగా పుచ్చుకునేవారు. అందువల్ల అతడు తెగించి ఒక బస్సు సంపాదించాడు! మనిషిని రూపాయికే చేరవేయడం మొదలుపెట్టాడు! అద్దెమైన వాళ్లనీ ఊరికేనే ఎక్కించుకొనడం అతడికి సరదా. ఒక దొరచుట్ట పళ్లల్లో నొక్కించి, తనే బస్సు నడిపేవాడట. అలా ముందుగా రవాణా సాధనం ఒకటి ఏర్పాటు చేసుకొని, స్థానిక ఉద్యోగులను కట్టుకున్నాడు! అమ్మైన తన శృంగారగ్రంథాలను, మరి ఇతర చౌక పుస్తకాలను మార్పిడి చేసుకొని, వాటితో వర్తకం సాగించాడు. పాశ్చాత్య శృంగార గ్రంథాలను కూడా తెలుగు చేసి వేసేవాడు. చెన్నపట్నంనుంచి బ్లాకులు తెచ్చునని, బొమ్మలపుస్తకాలూ వేసేవాడు. రవాణా ఖర్చులూ తగ్గాయి—పుస్తకాలూ చౌకగా ఇచ్చాడు. అది ఏమి సరదా అసాంగ! ప్రయోజనకరమైన సరదా.

## బొమ్మలపుస్తకాలు

బొమ్మలపుస్తకాలంటే జ్ఞాపకం వస్తుంది... చెన్నపట్నంలో ఒకరు వచనంలో రామాయణం (దేవరాజసుధి వ్రాసినది) వేశారు. ఆరోజుల్లో ఆ గ్రంథం చదివినవారు, చదవాలని ఉబలాటపడినవారూ అనేకులు. ఆపుస్తకంలో వాసుదేవనాయకర్ అనే చిత్రకారుడు బొమ్మలు వేశాడు. ఆబొమ్మలన్నింటినీ కలిపి వేరేపుస్తకం వేస్తే, అవన్నీ అమ్ముడుపోయాయి.

బొమ్మలపుస్తకాలూ, వచనరచనలూ, చౌకపుస్తకాలూ, ప్రచురించడం నవీన కృషిఅనీ, పాశ్చాత్యులు పెట్టిన బుద్ధి భిక్షఅనీ ఇప్పట్లో పలువురిమతం.

## భావం-అక్షరం

అచ్చువచ్చిన కొత్తరోజులు—అవి నలభైఏళ్ల క్రిందటివరకూ సాగాయి— చాలా సత్కృషి జరిగినకాలం. మళ్ళీ బందరుసంగతే ఒకటి చెప్తాను. సుబ్బారావుఅనే అచ్చుకూర్పరి, అచ్చుకిచ్చిన గ్రంథాన్ని మరి పేరదిద్దడాలు లేకుండా తయారుచేసి ఇచ్చేవాడట. ఆరోజుల్లో మద్రాసులో కూర్పరులు మరోమెట్టు పైకెక్కారు. వాళ్లకి భక్తికూడా ఉండేది చేస్తున్న పనిలో. కూలీ తీసుకుంటున్నా వారు కూలి చేసినవారు కారు. పండితునిది భావం—కూర్పరిది అక్షరం. అలా సాగిపోయేది.

వరంగల్లులో శైవసమాజం, ములుగు పాపయారాధ్యుని 'సర్వమధురం' అచ్చువేయించారు. వారి ప్రాస్తావిక పద్యాలుకూడా వేశారు. అన్నీ చౌకగానే. అవి మరి ముద్రణలకు నోచుకొనటట్లున్నది. తర్వాత ఎవరో పాపయారాధ్యుని 'దేవీభాగవతం' ముద్రించారు. ఊరికేనే ఇచ్చారు. వారి మతకుల చట్రంలో ఇరుక్కోగలిగినవారికి. బహుశా, అనేకులు పాపయారాధ్యుని రచనలు చదువుకోవాలనుకునేవారు ఉండిఉంటారు.

ఆకాలందరిదాపుల్లోనే తణుకు (లేక దునికి?) సుబ్రహ్మణ్యచరిత్ర అనే ఒక నవలను భాగానగరం సర్కింగ్ దేవరఅనే వ్యక్తి ముద్రించారట. మరొక వ్యక్తి సుజ్ఞాన బోధిని అనే కథల పుస్తకం వేశారట. అలా అనేకమైన మంచి మంచి పుస్తకాలు వేశారు. అవేసినప్పుడు ఒక యుగం-ఆ తర్వాత రోజు మారిపోయాయి. వ్యాపారం, ఆశ్రయంపు-మరో పుంతలో కొక్కాయి. వాళ్లు ఏదో చేశారని చెప్పుకోవాలే గానీ, ఏమి చేశారో కట్టిగా తెలుసుకునే అవకాశం లేదు.

## కొందరు సాహితీసేవకులు

పూండ్ల రామకృష్ణయ్యగారు (నెల్లూరు) అముద్రిత గ్రంథ చింతామణి అనే పత్రికను ప్రకటిస్తూ ఉండేవారు-చిరకాలం. సాహిత్యం పైన అనంతమైన భక్తి ప్రపత్తులను కలగ జేశారు. విమర్శలు వెలువరించేవారు. అలాగే సరస్వతీ (కొప్పెల్లి కోట వెంకట కృష్ణారావుగారు) "మంజువాణి" (మంత్రి ప్రగడ భుజంగరావు పంతులుగారు) ఇలాగే ఎంతో సేవ చేశాయి. ప్రబంధాలు ప్రచురించారు. కేవలం సాహితీసేవే పరమావధిగా పని చేశారు. పేరుతెచ్చుకున్నారు-పలువురికి పేరు వచ్చింది. సాహిత్యానికి ప్రచారం జరిగింది.

కొమర్రాజు లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి కూడా విజ్ఞాన గ్రంథాలను చౌకగా ప్రచురించింది. వేగుచుక్క గ్రంథమాల, 'ఆంధ్ర ప్రచారిణి' ఎప్పటికప్పుడు పాఠకులకు ఉత్సాహం కలిగించాయి, వ్యాపారం చేసినా, రాబోయే పుస్తకం కోసం అనేకులు కాచుకున్నర్పునే వారు.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు-అముద్రిత గ్రంథ చింతామణి లాగానే-ఒక చారిత్రక సంస్థ. శ్రీమంతుల సహాయం లభించడం ఒక ఎత్తు.జయంతి రామయ్య గారి పూనిక ఒక ఎత్తు. ఆంధ్రభాషలో వినక వారు మావిన పాండిత్యాన్నంతా పరిషత్తు ఆవిష్కరించింది. కొత్తపండితుల పరిశోధనా ప్రతిభ పైకిరావడానికి మహావకాశం కల్పించింది. ఎన్నో పుస్తకాలు, చౌకగానే వేశారు. పండితుడైనవాడు వాటిని వదలలేడు అనవచ్చు. మొత్తానికి అది పండితుల సంస్థ. పట్టుదల గల పండితులు ఉంటేనే దాని కృషి సాగుతుంది.

మొత్తంమీద - పాతికముప్ఫైఏళ్ల క్రిందదాకా, ఒక యుగం-- అచ్చు పనిని భక్తితో, కేవలం వ్యాపారదృష్టితోకాకుండా, అందరికీ అందుబాటులో ఉండటం లక్ష్యంగా, పనిసాగిన రోజులు.

## ఉత్సాహానికి సాక్షి

అయుగానికి పతాకప్రాయం, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి 'సాక్షి' ప్రచురణ.

అణా పెట్టే ప్రతి ఆదివారం ఒక సారస్వతభోజనం—

ఇంటికి పత్రిక వచ్చేవాకా ఉండబట్టలేక, అదరాబాదరా తెప్పించుకొని తను చదువుకొని, ఆనందంతో పదిమందిని పిలిచి-అక్కడికి తనే మహా విజంఘాల శాస్త్రి, వాణీదాసుడో అయినట్లు, దాన్ని చదివి వినిపించడం, అట విడుపు కాలక్షేపం. సాక్షికోసం పఠన బృందాలు ఏర్పడ్డాయి. ప్రతి ఇంట్లోనూ ఒక బృందం. కగుడుగట్టిన పూరాచార పరాయణుడు కూడా, 'పెళ్లాం' కూడా చదివి వినిపించాడు, 'పెళ్లాం' ఆడదిపోదూ!' అనే మూక్తిని విస్మరించి పండితులు, పామరులు, అధునికులు, సనాతనులూ—అందరూ మామూలుగా చదువుకొనడమే గాక—ఆతకతక శైలి, ఆ జరజర శైలి, ఆ ధోరణి, మరీమరీ ఆనందించేవారు. పదుగురికీ చెప్పుకునేవారు. మామూలువాళ్లు కూడా అరిందాగా మాటలు ప్రయోగించేవారు. ప్రతివాడూ ఒకమాటల టంకసాల అయిపోయాడు.

అంత ఉద్ధృతంగా అక్షరాస్యులపైన వచ్చిపడి ఆనందం కలిగించిన సాహిత్యం మరి ఇంతవరకూ రాలేదు.

నేను పుస్తకాలు ఏమివెయ్యాలో తెలియదు...ఎవరు వెయ్యాలో చెప్పలేం. ఎట్లా వేస్తే బాగో, తీరనిచర్చ. తెలుగువారికి ఏమి కావాలో అనేది తెగనిచర్చ. —జె. కె.

# పుస్తకాలు: ఒకకళ - ఒక వ్యాపారం

శ్రీ డేవిడ్ గ్రీన్

పుస్తక వ్యవహారం—అదంతా ఒక కళ, ఒక వ్యాపారం. రచయిత, ప్రకాశకుడు, విక్రేత, పాఠకుడు ఈ వ్యవహారంలో చూపెట్టే అభిమానం, ఆసక్తి, అభిజ్ఞతలపై మంచి సాహిత్యానికి లభించే ప్రచారగతి ఆధారపడి ఉంటుంది.

ప్రజాస్వామ్యంలో ప్రజలు నిర్వహించే పాత్రలాంటిదే, పుస్తక వ్యాపారంలో పాఠకులు నిర్వహించేపాత్ర. ఎలాటి ప్రజలకు అలాటి ప్రభుత్వం లోరసిల్లుతుంది. అలాగే పాఠకులను తగిన పుస్తకాలు పుట్టుకొస్తాయి. అయితే డబ్బులేనివారు ఎక్కువై, గ్రంథపఠనం తక్కువైన దేశంలో ప్రజాసముదాయంలో పుస్తకాలపై మక్కువ కలిగించడం గ్రంథ ఉత్పత్తిదారుల విధి. నేటి బడిపిల్లలు భవిష్యత్తులో పాఠకులు. వాళ్ళకి ఎలాటి కాల్పనికలను అభిరుచులను నేడు కల్పిస్తున్నామో, వాటినిబట్టి వారి గ్రంథ పఠనాసక్తి రూపొందుతుంది. సరియైన ప్రోత్సాహం ఇవ్వకపోతే, వారి అభిరుచి గిడసబారిపోవడమో అపమార్గం పట్టడమో జరుగుతుంది; అశ్లీలాలు, ఘోరాలు చిత్రించే పుస్తకాలను చదవడమో లేక దినపత్రికలు మొదలైనవి చదవడంలో ఆసక్తి ముగిసిపోవడమో జరుగుతుంది. పాఠశాలల పాఠ్యప్రణాళిక నిర్ణాయకులు రాబోయే తరంవారి అభిరుచులను అడుగంటచేయనూ గలరు. ఉన్నతమూ చేయగలరు.

ఇకరచయితలు: చాలామంది రచయితలకు బ్రతుకు తెరువు పుస్తకాలు వ్రాసుకొవడం పని అని మనం మరిచిపోరాదు. ఎక్కువమందికి కావలసినది 'చెత్త' అవుతే, 'చెత్త' వ్రాసేవాళ్లు ఉండక పోరు. కానీ ఒక జాతి జాతీ తన అభ్యు

(9 వ పుట చూడుడు)

# గ్రంథపరిచయం

# పుస్తక వ్యాపారంలో ప్రభుత్వ పాత్ర

## ఉన్నతాధికార విచారణ సంఘాన్ని నియమించాలి

శ్రీ సదానంద్ భక్తల్

మనం ఒక యుగసంధిలో బ్రతుకుతున్నాము. పాత పద్ధతులను మార్చుకొని, కొత్త ఆదర్శాల సాధనకు పూనుకున్నాము. కొత్తప్రయోజనాలు కొత్త నియమాలు సాధించుకుంటున్నాము. పుస్తక ప్రపంచంలోనూ ఈ యుగసంధి ప్రభావం పడింది. కొందరు ఇందులో వ్యక్తిస్వాతంత్ర్యం ఉండాలంటున్నారు — కొందరు ప్రభుత్వం చేయించాలంటున్నారు. మనది శ్రేయోరాజ్యం కాబట్టి, యీ రెండు భావాలకూ సమన్వయం చేసుకుని పోవాలి.

మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ, ప్రభుత్వమూ, రచయితలూ, పత్రికలూ, పుస్తక వ్యాపారస్తులూ, సంఘంపట్ల తాము నిర్వర్తించవలసిన బాధ్యతలనూ, ఈ వ్యాసంగంలో వున్న ఒడుదుడుకులనూ అవసరాలనూ గ్రహించారు. రచయితలనూ, ప్రచురణకర్తలనూ, ముద్రాపకులనూ, గ్రంథాలయాలనూ, ప్రోత్సహించడానికి ప్రభుత్వం అనేక సంస్థలను తయారుచేసింది. ప్రభుత్వం చేస్తున్న ఈ సహాయాన్ని 'ప్రతిభకు లభిస్తున్న బహూకరణ'గా పాటించకుండా, 'ఇది కష్టానికి ప్రతిఫలంలే' అనే ధోరణిలో వ్యవహరిస్తే చివరకు ప్రభుత్వం నిరంకుశ విధానాలను అవలంబించడం తటస్థిస్తుంది.

అభివృద్ధి కార్యక్రమాలపేరిట ప్రభుత్వం అనేక విద్యాసంస్థలకు విరాళాలిస్తున్నది. కొత్తకొత్త సంస్థలను నెలకొల్పుతున్నది. నిరక్షరాస్యత క్రమేణా తగ్గిపోతున్నది; ఎక్కువ విద్యను సంపాదించాలనే ఆసక్తి పెరుగుతున్నది. సాంస్కృతిక కార్యక్రమాలు ఎక్కువవుతున్నాయి. చదువుకున్నవారిలో చదవాలనే అభిలాష పెరుగుతున్నది. సాహిత్య అకాడమీద్వారా యోగ్యత గలరచయితలకు ప్రోత్సాహం,సాహిత్య చరిత్రల రచనకూ, అనువాదాలకూ—దోహదం లభిస్తున్నది, ప్రతిభావంతులకూ ఉత్తమ రచనలకు మన్ననా బహుమతులు లభిస్తున్నాయి. మంచి ముద్రణకు, మేలైన పుస్తకోత్పత్తికి కూడా ప్రభుత్వం బహుమతులు ఇస్తున్నది. ప్రభుత్వ పుస్తక ప్రచురణ శాఖ పుస్తకాలను వివిధవిక్రేతలు అమ్ముతూ, ప్రభుత్వ ఆర్థిక సాంస్కృతిక కార్యక్రమాలనూ ఆశయాలనూ ప్రజానీకానికి తెలియజేయ గలుగుతున్నారు. గ్రంథాలయాల కార్యక్రమాలూ విస్తృతమైనాయి. ప్రతిజిల్లా తాలూకా కేంద్రంలోనూ గ్రంథాలయాలు నెలకొంటున్నాయి; త్వరలో ప్రతిగ్రామంలోనూ నెలకొంటాయి. పెద్దగ్రంథాలయాలకు ప్రభుత్వంనుంచి పెద్దవిరాళాలు లభిస్తున్నాయి. మద్రాసు, కలకత్తా, బొంబాయిలలో ఉన్న ప్రాంతీయ గ్రంథాలయాలు, ఢిల్లీలో నిర్మించనున్న ప్రాంతీయ గ్రంథాలయమూ, దేశంలో సాగే సాహితీ సృష్టికి ఆగారాలై విలసిల్లుతాయి. దేశంలో ప్రచురించిన పుస్తకాల జాబితాలను తయారుచేయడానికి ప్రభుత్వం పూనుకుంది.

అయితే ఒక్క విషయాన్ని విస్మరించరాదు. పుస్తకవ్యాపారం సంఘజీవనంలో చాలా ప్రముఖమైనది; ప్రాబల్యం గలది. రచయిత, ప్రజానీకానికి వివిధ సమస్యలను విప్పి చెప్తాడు. అతడికి తగు రక్షణలేనిదే రచనా వ్యాసంగం సరిగా సాగదు. వ్యాపారికి అడుగడుగునా భయమే. వ్యాపారికి వ్యాపారంలో ఖచ్చితంగా లాభంవచ్చే ఏర్పాటు ఎవ్వరూ చేయలేరు. కానీ పుస్తక వ్యాపారికి భయం లేకుండా చేయాలి, నష్టపోము అనే ధైర్యం కలిగించాలి.

గ్రంథాలయాలకోసం ప్రభుత్వ సంస్థలకోసం ప్రభుత్వం పుస్తకాలు కొంటుంది. ఇలా కొనడంలో వచ్చే అనుభవాన్ని పురస్కరించుకొని, పుస్తకాల ధరల సరళిని నిర్ణయించవచ్చు. ఇలా చేస్తే ప్రభుత్వమే పుస్తకాల ధరలను నిర్ణయించడంలో, సమంజసమైన ధరల నిర్ణయానికి పద్ధతి ఏర్పడుతుంది. వ్యాపారానికి సురక్షిత స్థితి ఏర్పడుతుంది.

అదిగాక, నిరక్షరాస్యతా నిర్మూలనం విద్యావ్యాప్తిలో పుస్తక ప్రచురణకర్తలు, పుస్తక విక్రేతలు ప్రముఖ బాధ్యత వహించవలసినవారని గుర్తించాలి. విద్యాశాఖ కార్యక్రమంలో ఇది ఒక భాగంగా సాగాలి.

పుస్తకాల రవాణాకు తపాలా ఖర్చులు అధికమైనాయి. కొన్ని రాష్ట్రాలు అమ్మకంపన్నో కొలుగోలుపన్నో ఇంకా వసూలుచేస్తూనే ఉన్నాయి. కాగితంపైన ఎక్సైజ్ సుంకం వసూలు చేస్తున్నారు. న్యూస్ ప్రింట్ వాడకంపైన అనేక నిషేధాలు విధించారు. ఇవన్నీ పుస్తకాల వ్యాప్తికి నిరోధాలు. సాహితీ ప్రచారానికి అడ్డంకులు. పుస్తక ప్రకాశకులు ప్రస్తుతం ఎక్కువ ధరలు వేస్తున్నారు-తీరా పుస్తకాల అమ్మకం తృప్తిగా సాగదు. అందువల్ల పై నిషేధాలు, అడ్డంకులు తొలగించడం అవసరం.

పుస్తక ప్రపంచంతో సంబంధం ఉన్న వారందరూ కలిసి కట్టుగా పై ఇబ్బందులను తొలగించే ప్రయత్నం చేయాలి.

పుస్తక ప్రచురణకు తగు వరవడి లభింపచేయాలని ప్రభుత్వం సంకల్పించింది. సంతోషమే. కానీ కొన్ని రాష్ట్రాల్లో పాఠ్యగ్రంథ ప్రచురణను ప్రభుత్వాలే చేపట్టున్నాయి.

పుస్తక ఉత్పత్తి సమస్యల విచారణకు ప్రభుత్వం ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించాలి. అప్పుడే మంచి సాహిత్యం సృష్టిఅవుతుంది.

ఇటీవల ప్రధాని నెహ్రూ సింహళయాత్ర ముగించుకుని తిరిగి ఢిల్లీ వెడుతుండగా మద్రాస్ విమానాశ్రయం వద్ద ఇయనను దక్షిణ భారత పుస్తకప్రకాశన సంస్థ జనరల్ మేనేజర్ శ్రీ కృపానిధి, కార్యదర్శి శ్రీ రఘునాథన్ కలుసుకుని సంస్థ యాజమాన్యాన ప్రచురించిన పుస్తకాలను బహూకరించారు.

## మోటారు రవాణా ప్రజావసర పరిశ్రమ

హైదరాబాద్, జూన్ 1: పారిశ్రామిక వివాదాలచట్టానికి సంబంధించినంతవరకు, మోటారు రవాణా పరిశ్రమ, మరో ఆరునెలలపాటు ప్రజావసరమైన పరిశ్రమగా, ప్రభుత్వం ప్రకటించింది.

# మంచి పుస్తకాలు చదివే ఓపికలేదు: మంచివి కానివి అక్కర్లేదు

డా॥ ముల్క్ రాజ్ ఆనంద్

పూర్వం మనదేశంలో రచయితా ప్రచురణకర్తా వేరువేరు వ్యక్తులు కారు. ఒకడే. తన భావాలు తను వ్రాసుకునేవాడు—చక్కగా వ్రాసుకునేవాడు; లేకపోతే వ్రాయించుకునేవాడు. ఆపైన దానిని ఎవరికి అంకితంగా వ్రాశాడో వారికి వినిపించేవాడు. అంకితం పుచ్చుకున్న వాడిమీద, అతగాడికి దేవగణంలో ఎవరితోనో పోలికలుపెట్టి, లేక ఏ దేవుని అంకితో అంటగట్టి, ఆ గ్రంథాన్ని అతగాడికి సమర్పించేవాడు. అతగాడు దాన్ని పదిలం చేసుకునేవాడు, నేడు పదవీ విరమణచేసినవారు తను హయాంలో లభించిన సన్మాన పత్రాలను దాచుకున్నట్లు. రచయితకు బంగరు నాణెములో, భూమిపుట్రా — మరీ మేలుచేస్తే, రమణీప్రియ దరహాసం, లభించేవి.

ఆసియాఖండంలో రచయితా— ప్రచురణకర్తా—పాఠకుని సంబంధాల చరిత్రలో, కనువిప్పు కూర్చునది, బహుశా, మహమూద్ గజ్నవీకీ ఫిర్దౌసీ కవికీ మధ్యజరిగిన వ్యవహారమే అయివుంటుంది. షానామానువ్రాస్తే ఇంత ఇస్తాను అని ఫిర్దౌసీకి మాట యిచ్చిన గజ్నవీ, తనమాట తప్పాడు.

పుస్తక ప్రచురణకర్త రచయితకూ పాఠకునికీమధ్య ఒక రకమైన దళారి; తెలివితేటలు చూపి పాఠకునివద్ద తను వేతం సాగించి, అందుకు తగిన పద్దులూ అవ్వివేసుకొని, ప్రచురణకర్త వ్యవహరిస్తాడు. అందువల్ల రచయితలు అతడి దగ్గరచేరుతారు. రచయితలు వ్యాపార కుశలురు కారు—జలపాలుపెంచుకొని, కప్పల తక్కెడ అలవాటతో గడుపుతూ ఉంటారు. ప్రఖ్యాత వేదాంతి ప్లేటో, రచయితలను బాధ్యతగల ఏవర్గంకింద జమకట్టక, పైగా తన 'గణరాజ్యం'లో వారికి స్థానమైనా లేకుండా చేశాడు.

రచయితలకు కాస్త డబ్బుకావాలి. అతడు ప్రచురణకర్త దగ్గర చేరడానికి అదే కారణం. ప్రచురణకర్త తన దగ్గరవున్నదో లేక పాఠకులవద్దనుంచో తేగలిగినదో, కొంతసొమ్ము ఇస్తాడు. ఇద్దరికీ డబ్బు సంబంధమే. కాక పోతే మధ్య మధ్య రేపేవడో బాగా ఇవ్వగలిగినవాడు తారసిల్లుతూ ఉంటాడు. అప్పుడు రచయిత పని కాస్త పచ్చి పచ్చిగా ఉంటుంది.

అయితే సామాన్యంగా జరిగేదేమంటే, రచయితకు ఇవ్వదగిన డబ్బుఎంతో ఆ ఊసు ఎత్తకుండా, అతగాడికి ఒక విందులేక ఒక గోవిందు ఏర్పాటుచేస్తారు ఏ ఘరానాహోటల్‌లోనో. దానికి హాజరు కావడానికి ఆ రచయిత ఉక్కిరిబిక్కిరై, సంతసుష్టాటుచేసుకొని, తీవితో తరలిపోతాడు. అదొక ఖర్చు!—అదొక అరువు ఆర్భాటం! ఇక విందులో, ఆ వ్యాపారి డబ్బు మాటెత్తడు-రచయిత ఆ మాట ఎత్తడానికి శతవిధాలా యత్నిస్తాడు. విందు మొత్తంమీద ఎవరికీ గుండెనింపే కులాసా చిక్కదు.

ఇక, ప్రచురణకర్త దగ్గరకు అనేక రచనలు వచ్చిపడ్తూ ఉంటాయి. ఆరాతలు అంటే అతగాడికి ఒక విధమైన లెక్కలేనితనం కలుగుతుంది. రచయిత తను 'దైవతుల్యుడను' అని బుజాపు చేసుకునేదాకా, ప్రచురణకర్తదృష్టిలో అతడు ఒక ప్రేతమే. రచయితకు దైవత్వం సాధారణంగా సిద్ధించదు. ఆ రచనను ప్రచురించడం వ్యాపారదక్షత కాదని ప్రచురణకర్త మొరాయిస్తాడు. తక్కువధరకు వేయవచ్చు. రచయితకు తక్కువే ముట్టచెప్తారు. పైగా ఆరచన బాగుందని ఎవరైనా అంటే, ఆ మాటలు రచయితకు చేరవేయరు. విమర్శలు వస్తేమాత్రం చెవినవేస్తారు. అప్పుడు చేయం పోటున పడ్తుందికదూ!

ప్రచురణకర్తల దగ్గరవచ్చే పుస్తకాలన్నీ మంచివేనని నేను అనడంలేదు. పేరున్న రచయితలతోనూ ఇదే పద్ధతిలో వ్యవహరిస్తారు. అందువల నేనే హెచ్. జి. వెల్స్, ప్రచురణకర్తలను మార్చుకుంటూ ఉండేవాడు.

ఇక ప్రచురణకర్త, రచనలను కత్తిరించడం ఒక జబ్బు. నీతి నియమాలు, రాజకీయాలు దృష్టిలో పెట్టుకుని అలా చేస్తున్నా నంటాడు. ప్రభుత్వం 'ఇది అశ్లీలం' అంటుందేమోనన్న అనుమానం కలిగిన భాగాలన్నింటినీ కత్తిరించేస్తాడు. 19 వ శతాబ్దంలో పశ్చిమయూరప్‌లో ఇలాగే 'ముద్దు, కౌగిలి' అని ఉన్న భాగాల నన్నింటినీ కత్తిరించేశారు. వ్యాజ్యాలు, పరువునష్టం దావాలు వస్తాయేమోనని ప్రచురణకర్తలకు లెక్క భయం. అయితే న్యాయస్థానాలుఅంతే

4 పుట చూడుడు

## ఒకకళ-ఒకవ్యాపారం

(7 వ పుట తరువాయి)

దయంకోసం ఒక గమ్యం చేరడాని కోసం ఉద్యమ దీక్ష వహించినపుడు, మంచి సాహిత్యం సృష్టి అవుతుందని చరిత్ర చెప్తున్న సత్యం. గ్రీసు, రోం, బ్రిటన్ చరిత్రల్లోనూ, పురాతన భారత దేశ చరిత్రలోనూ 'ఈ సత్యం గోచ రిస్తుంది. ఇది భారతజాతి పునర్జన్మ ఎత్తినకాలం. ప్రజలూ నాయకులూ పూనుకుంటే సాహిత్యానికి జ్యోన్నత్య సిద్ధి కలుగుతుంది. దక్షిణ భారత పుస్తక ప్రకాశకసంస్థ పాఠకులకు ఉత్సాహం, రచయితలకు ప్రోత్సాహం కలిగించాలని సంకల్పించింది. రచయితలు సాహ్య మైనంతవరకూ స్వతంత్ర రచనలు చేయడానికి తగు ప్రోత్సాహాన్ని కల్పించాలి. పుస్తక ప్రకాశన సంస్థ కార్య క్రమం అందుకు అనువుగా ఉండడం ముఖ్యం.

పుస్తక ప్రచురణ కర్త గొప్పతనం, పుస్తకాన్ని తీసుకొనడంలో ప్రచురించడంలో అతడు చూపే వివేచన బట్టి ఉంటుంది. పాఠక లోకానికి అతడు చేయగలసేవ, అతడి అభిరుచినిబట్టే తెలిపోతుంది. ప్రజలకు ఏం కావాలో ఒక కేసులవాడిలాగా అతడు తెలుసుకోవాలి; రచయితలతో సాన్నిహిత్యం ఏర్పరచుకోవాలి. ఇలా చేయగలిగి ఉండడానికి, వస్తుతః అతడు చదువు కున్నవాడై వుండాలి. లేకపోతే ప్రచురణకు వచ్చే రచనలలో వేటిని ఎన్ను కోవ గలుగుతాడు?

పుస్తకాలు బాగా అమ్ముడు పోవడానికి పుస్తక వ్యాపారి దక్షత ముఖ్యావసరం. గ్రంథపఠనాసక్తి కల్గించడంలో విద్యావ్యాప్తి ఎంత ముఖ్యకార్యక్రమమో పుస్తకాల విక్రయ కార్యక్రమమూ అంతే ముఖ్యం. దక్షిణ భారతదేశంలో సరియైన పుస్తక విక్రేతలు తక్కువ. ఏవో-పుస్తకాలను దుకాణంలో పెట్టారు!

చాలా పాఠశాలలకు అనుబంధంగా పుస్తకాల అంగళ్ళుకూడా పెట్టు న్నారు. కీర్స్ళు, పుస్తక ప్రచురణ కర్తలు ఇచ్చే లాభాలను గుంజుకొని, స్థానిక పుస్తక విక్రేతలకు ఏమీ లభించకుండా చేస్తున్నారు. పాఠశాలల వారి అభిమానం ఎక్కడ తరిగిపోతుందో అనే భయం చొప్పున, ప్రచురణ కర్తలుకూడాటెలిఅంగళ్ళకుసామాన్యంగా వ్యాపారంలో సాధ్యం కానంత లాభం కలగజేస్తున్నారు కూడాను.

పుస్తకాలను నిక్కచ్చి అయిన ధరలకు అమ్మడానికి తగు ఏర్పాటు అవసరం. ప్రచురణ కర్తలూ విక్రేతలూ ఇందుకు అవసరమైన సమాధానానికి రావాలి. పుస్తకవిక్రేతకు చదువు వచ్చి ఉండాలి, వివిధ అభిరుచులను ఆకళింపు చేసుకునే తెలివితేటలు ఉండాలి. పుస్తకాల సంగతి తెలిసిఉండాలి. తెలివితేటలుగల పుస్తకవిక్రేత, ఒకబడి పంతులు, మత ప్రచారకుడులాంటి ప్రయోజనకారుడే అని ఆలెగ్జాండర్ మాక్మిలన్ సూక్తి. అదే నేటికీ దక్షిణ దేశంలో అనుసరణీయం.

## ఆంధ్ర విశ్వ విద్యాలయం

### సెనేట్‌లో ఒకస్థానానికి ఉపఎన్నిక

హైదరాబాదు, మే 31: విశాఖపట్నం జిల్లా స్థానిక సంస్థలనుంచి ఆంధ్ర విశ్వ విద్యాలయం సెనేట్‌లో ఒకస్థానం ఖాళీ అయింది. జిల్లాలోని పురపాలక సంఘాల సభ్యులూ పంచాయతీ బోర్డుల అధ్యక్షులూ, ఈ ఎన్నికకు వోటర్లు అభ్యర్థిపత్రాలను పంపించడానికి జూన్ 8 వ తేదీ ఆఖరి గడువు. అదేరోజు సాయంకాలం అయిదింటికి జిల్లా కలెక్టరు కార్యాలయంలో అభ్యర్థిపత్రాల పరిశీలన జరుగుతుంది. అభ్యర్థిపత్రాల ఉపసంహరణకు జూన్ 10 వ తేదీ గడువు. వోటింగు అవసరమైతే జూన్ 28 వ తేదీలోపల పూర్తిచేసి పంపించేపద్ధతిని వోటు కాగితాలను జూన్ 17 న వోటర్లకు పంపిస్తారు. జూన్ 29 న వోట్ల లెక్కింపు జరుగుతుందని ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రకటిస్తున్నది.

## మనిలా కూటమిలో చేరే వుద్దేశం

### జపాన్‌కు లేదని ప్రధాని స్పష్టీకరణ

కొలంబో, మే 31: మనిలా కూటమిలో చేరమని ప్రస్తుత జపాను ప్రభుత్వ పక్షమైన మితవాద పక్షం వాదించడం లేదని, కనీసం అలా చేరే వుద్దేశం కూడా లేదని అటువంటి పనులకు తాను చాలా వ్యతిరేకులమని జపాను ప్రధాన మంత్రి శ్రీ నబుసుకె కిషి, నేడు విలేఖరులు వేసిన వివిధ ప్రశ్నలకు సమాధానమిస్తూ శ్రీ కిషి ఇలా చెప్పారు.

### ఫార్మోజా అల్లర్లు

"ఫార్మోజాలో ఇటీవల అల్లర్లు జరగడం దురదృష్టకరం. తగాదాలు శాంతంగా పరిష్కారం కాగలవనిఆశిస్తాను. ఈ అల్లర్ల ఫలితాలు జపాన్‌లో ఏమీ కన్పించవు. వీటిని గురించి అంత ప్రత్యేకంగా ఎవరూ అక్కడ పట్టించుకోరు"

### అమెరికా ప్రయాణం

"నేను త్వరలో అమెరికా వెళ్ళబోతున్నాను. ఉభయదేశాల మధ్యగల సమస్యలు పరిష్కరించే విధానాలు చర్చించడం, స్నేహ సంబంధాలు దృఢతరం చేయడం మా లక్ష్యం. ఒకినావా తదితర దీవులపై అమెరికా ఆధ్వర్యం గురించి ముఖ్యంగా చర్చిస్తాను. అయితే రుది పరిష్కారంకోసం తేరాలు మొదలుపెట్టబోను. మా ప్రజల భావాలు మాత్రం తెలియబరుస్తాను."

### అణుపరీక్షలు: సైనిక కూటమి

"అమెరికా వెళ్ళినప్పుడు అణ్వస్త్ర పాటవ పరీక్షలు ఆపుచేయాలని నేను కోరుతాను. సైనిక సంధుల విషయమై మాదేశపు నాయకులు కొందరు చేసిన ప్రకటనలను మీరు ఉదహరిస్తున్నారు గనుక మావిధానం వివరిస్తాను. ప్రస్తుతం అధికారంలోవున్న మితవాద పక్షం మనిలాకూటమిలో చేరమని వాదించడం లేదు. కనీసం ఆ ఉద్దేశంకూడా లేదు. మేము ఇందుకు వ్యతిరేకులం. అసలు ప్రాంతీయ సైనికకూటాలలో చేరే అవకాశాలనే మా రాజ్యాంగం నిషేధిస్తున్నది."

"ఈ అణుపరీక్షలు నిలిపే విషయమై నేను కలుసుకొని మాటాడిన ఆసియా నాయకులంతా ఒకే మాటపై వున్నారని చెప్పగలను. ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని సమీకరించాలనే అందరి ఆశయం. ఐతే యీపరీక్షలు నిలపడం అన్నది అయుధనిషిద్ధపద్ధతితో పాటుజరగాలి. అందుకనే ఆయుధ విసర్జన ఉపసంఘం ద్వారా పనిచేసేందుకు అంగీకరించాం."

### చైనాను గుర్తించం

"ఆసియాలో భిన్న జాతులవారు వుంటున్న పరిస్థితులు వేరువేరుగావున్నాయి. ప్రస్తుతం కమ్యూనిస్టు చైనాను జపాను గుర్తించే స్థితిలో లేదు."

### ఆసియా అభివృద్ధి నిధి

"ఆసియా అభివృద్ధికి ఒక నిధిని నెలకొల్పేవిషయమై నేనుఆసియా నాయకులలో చర్చలు జరిపాను. దీని ఆశయం తక్కువవడ్డీతో ఆసియాఅభివృద్ధికి దీర్ఘకాలపు పెట్టుబడులుపెట్టడమే. కొలంబో పథక దేశాలన్నీ దీనితో సహకరించాలి. న్యాయంగా అందరికీ సహాయం లభించడానికి ఒక సలహాసంఘం నియమించుకోవచ్చు. నిధికి చాటాలు చెల్లించారా లేదా అన్న ప్రస్తావన లేకుండా అందరు దీనిలో సభ్యులుగాచేరవచ్చు. ముఖ్యమైన సరుకుల రవాణాకు, ప్రాథమికోత్పత్తి సరకుల ధరల స్థిరీకరణకు యీ నిధి వినియోగించవచ్చు.

"సింహళ నాయకులతో నేను జరిపిన చర్చలు సుహృద్భావ పూర్వకమైనవి. ప్రపంచ శాంతికి సమితి ప్రణాళికను పాటం కృషిచేయాలని శ్రీలంక నాయకులు మేము అంగీకరించాము."

## నగరంలో ఉష్ణోగ్రత

మద్రాసు, మే 31: నగరములో యీనాడ ఎండవేడిమి ప్రొద్దున నుంచి వడగాలితో అతి తీవ్రంగా ఉండింది. సాయంత్రం 4 గంటలవరకు కూడా చల్లబడలేదు. ఈరోజున అత్యధికోష్ణం 88.3 (102 డిగ్రీలు) దాకా పెరిగింది. ఈ సంవత్సరం ఇంతగా ఎండ తీవ్రంగా ఉండడం ఇదే ప్రారంభం.

## ఫర్మానా ఫోర్జరీ కేసు

### తీర్పు జూన్ 7 వ తేదీకి వాయిదా

హైదరాబాదు, మే 31: ఫర్మానా ఫోర్జరీకేసు అని ఖ్యాతి పొందిన దావాలో హైదరాబాదు జిల్లా మేజస్ట్రేట్, శ్రీ రామశంకర్ ప్రసాద్ యెదుట ప్రతివాదుల తరఫున వాదనలు ఈ దినం పూర్తిఅయినవి.

తీర్పు సాధ్యమయితే జూన్ 7 వ తేదీని ప్రకటిస్తామనీ, సాధ్యం కాని పక్షంలో మరి మూడురోజుల అనంతరము చెప్పగలమని జిల్లా మేజస్ట్రేట్ చెప్పారు.

ఈ కేసులో ప్రాసిక్యూషను అభియోగంలో నిజాము తన స్వంత స్థాపనలలో ఉన్న హిందూ పనివారంచరినీ తొలగిస్తూ ఉత్తరవు చేసినట్లు ఒక ఫర్మానాను "సైజందగి" ఉరుదు వార పత్రికలో పత్రిక సంపాదకుడు ప్రొ॥ షిర్కస్ ప్రకటించాడనీ, ఆ ఫర్మానా ఛాయాచిత్రాన్ని మిలాప్ పత్రికా సంపాదకుడు శ్రీ యుద్ధవీర్ కూడా ప్రకటించారనీ ఆరోపణ చేశారు.

ప్రతివాదుల తరఫున శ్రీ పల్లూరి వెంకటేశ్వరులు తమ వాదనలలో ఇలా చెప్పారు: "హైదరాబాదులో పోలీసు చర్యకు పూర్వము, తరువాత కూడా నిజాము వైఖరి గమనించిన ట్లయితే ఆయనకు కుల దురభిమానాలు ఉండిన సంగతి విదితం కాగలదు. ఈ సంగతిని పోలీసు చర్య సందర్భమున భారతప్రభుత్వము వెలువరించిన శ్వేతపత్రం వల్ల నిరూపణ అవుతుందని"ఆయనఅన్నారు.

ఫర్మానాలను ప్రతివాదులు సద్భావముతో వార్తను ప్రచారం చేయాలనే తలంపుతో ప్రచురించారు గాని ఆ వార్తను వారు సృష్టించడలచలేదని కూడా న్యాయవాది వాదించారు.

## మాండలే ఖైదులో తిలక్ స్మృతిమందిరం

న్యూఢిల్లీ, మే 30: లోకమాన్య బాల గంగాధరతిలక్ నిర్బంధితుడైన మాండలే లోని కారాగారంలో తిలక్ స్మృతి చిహ్నంగా ఖైదీలకు విద్యావినోద సౌకర్యాలు కల్పించే ఒక మందిరం రు 30 వేల ఖర్చుతో నిర్మించాలని భారత ప్రభుత్వంచేసిన సూచనను బర్మా ప్రభుత్వం ఆమోదించినట్లు, ఇవాళ లోక్ సభలో శ్రీ డి. సి. శర్మ ప్రశ్నకు జవాబిస్తూ, విదేశాంగ ఉపమంత్రి శ్రీమతి లక్ష్మీమీనన్ తెలియ జేశారు.

## సేవకూ కష్టాలకు త్యాగాలకు అంకితమైన జీవితం

### ఆంధ్రకేసరికి మద్రాసుపౌరుల జోహార్లు

మద్రాసు, మే 31: ఆంధ్రకేసరి అసమానదేశసేవ ధైర్య సాహసాలకు త్యాగానికి జోహార్లు సమర్పిస్తూ పలువురు పురప్రముఖులు నిన్న సాయంత్రం రాజాజీహాలులో ప్రకాశంగారిపట్ల ప్రశంస సంతాపం ప్రకటించారు.

"సభవారు శ్రీ ప్రకాశంపంతులుగారి మృతికి అత్యంత సంతాపం వెలిబుచ్చుతూ ఒక తీర్మానాన్ని గావించారు.

ఈ తీర్మానాన్ని మేయరు శ్రీ కె. యస్. శ్రీనివాసన్ ప్రతిపాదించగా రాష్ట్ర శాసనసభాపతి డా॥ యు. కృష్ణరావు దానిని బలపరచారు.

ఆంధ్ర ఆంధ్రేతర ప్రముఖులు పలువురు శ్రీ ప్రకాశం త్యాగనిరతిని ధైర్యసాహసాలను మొదలైన గుణగణాలను విశేషముగా కీర్తించి ఆయన "ఆంధ్రుల మకుటం లేని రాజు" అయిఉండినవారని అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ యస్. వి. రామమూర్తి మాట్లాడుతూ శ్రీ ప్రకాశంపంతులు నగర ప్రముఖులలో ఎన్నదగ్గవారుగా ఉండి నగర జీవితంలో ప్రధానపాత్రను వహించారని అన్నారు. "కష్టాలు లెక్కచేయక జీవితమంతటిని దేశసేవకోసం త్యాగంచేసిన మహోవీరులను గౌరవించడం మన ఆచారం. శ్రీ ప్రకాశం ప్రజల కష్టాల పట్ల అసమాన సానుభూతిని కలిగి దేశహితమే తమ లక్ష్యంగా పెట్టుకొన్న మహాపురుషుడు. పైకి సింహంవంటి కటువుగా కన్పించినా ఆయన హృదయం అతిసున్నితమైనది.

నగరంలోని వివిధ వర్గాలకు చెందిన ప్రముఖులు పలువురు యీవిధంగా ఆయన గుణగణాలను ప్రశంసించటానికి పూనడమే ఆ మహోవ్యక్తి కీర్తి ప్రతిష్ఠలకు నిదర్శనమై ఉన్నదని కూడా శ్రీ రామమూర్తి చెప్పారు.

శ్రీనివాసన్ యీ క్రింది తీర్మానాన్ని ప్రతిపాదించారు.

"శ్రీ ప్రకాశం పంతులు మృతికి యీ సభవారు అత్యంత సంతాపం ప్రకటిస్తున్నారు. ఆయన జాతీయ రంగంలోను విశాలాంధ్ర స్థాపనకును అపారసేవచేసి జీవితం ధారపోసినట్టి మహనీయుడు. ఆ మహోవ్యక్తి ప్రియ స్మృతి మద్రాసు ప్రజలలో శాశ్వతంగా జ్ఞాపకం ఉండగలదు."

శ్రీనివాసన్ యీ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీ ప్రకాశం నిర్యాణం వల్ల దేశానికే తీరని లోటు కలిగిందని అన్నారు.

డా॥ యు కృష్ణరావు తీర్మానాన్ని బలపరుస్తూ శ్రీ ప్రకాశం స్వాతంత్ర్యోద్యమంలోను ఆంధ్ర రాష్ట్ర స్థాపనకు గాను అసమాన సేవ చేశారనిఅన్నారు. అన్నారు. ఆయన మద్రాసులో ముఖ్యమంత్రిగా ఉన్నపుడు అనేక అభివృద్ధికరమైన కార్యాలను తలపెట్టారని, ఆంధ్రులలోనేగాక భారతీయులలో కూడా ఆయన అగ్రగణ్యులుగా ఉండినారని చెప్పారు.

శ్రీ పి. రామమూర్తి ప్రకాశం మృతివల్ల నగర పౌరులు తమలో ఒకరిని కోల్పోయారనీ అన్నారు. మద్రాసు నగరవాసులలోజాతీయస్వాతంత్ర్యోద్యమం పట్ల ఆసక్తి కలుగజేసినవారు శ్రీ ప్రకాశమని చెప్పారు. స్వాతంత్ర్య సమరవీరుడుగాను, పరిపాలకుడుగాను ప్రజానాయకుడుగాను శ్రీ ప్రకాశం అసమాన శక్తి సామర్థ్యాలను వ్యక్తపరచారని, ఆయన జీవితం నిరంతర త్యాగజీవితమని చెప్పారు.

శ్రీ శాపి ధర్మారావు ఆంధ్రప్రజల ఆదరాభిమానాన్ని చూరగొని ఆంధ్రదేశానికి తిరుగులేని నాయకుడుగా వ్యవహరించిన వీరుడు శ్రీ ప్రకాశం అన్నారు.

### గ్రామణి ప్రశంస

తమిళ రిరసుకజగం నాయకుడు శ్రీ యం. పి. శివజ్ఞాన గ్రామణి శ్రీ ప్రకాశం మృతివల్ల దేశం ఒక అగ్రేసరనాయకుణ్ణి, గొప్ప దేశభక్తుని కోల్పోయిందని అన్నారు.

ఎన్నితరాలైనా ప్రకాశంవంటి మహానాయకుని మనం తిరిగి చూడబోమని ఆయన చెప్పారు. బ్రిటిషు పాలకులకు ఆయన అసమాన ధైర్యసాహసాలు బాగా తెలియవచ్చింది. సైమన్ కమిషన్ వచ్చిన రోజుల్లో రొమ్ముచూపి తుపాకి ముందు నిలిచిన ధీరుడు శ్రీ ప్రకాశం అన్నారు-ఆయన పోలీసుల నిర్బంధ విధానానికి లాఠీఛార్జీలకు వెరవకుండా ఉండేలాగున ప్రజలకు తమ ఆదర్శంవల్ల ఉత్సాహం కలిగించారని అన్నారు.

ఆంధ్రరాష్ట్రంతో మనకు ఎల్లల విషయంలో యింకా కొన్ని విభేదాలు ఉన్నవి: అయితే శ్రీ ప్రకాశం యీ విభేదాలన్నిటికీ అతీతమై ఉండినారు. వారు ఆంధ్రుల తమిళుల ప్రజాభిమానం సరిసమానంగా చూరగొనగల్గినారు అని శ్రీ గ్రామణి అన్నారు.

శ్రీమతి అమ్ముస్వామినాథన్ శ్రీ సి. ఆర్. రామస్వామి నార్ల వెంకటేశ్వరరావు డా॥ కె. వి. స్వామి శ్రీ కె. వి. సోమసుందరాలు కూడా శ్రీ ప్రకాశం పట్ల భక్త్యంజలి సమర్పించారు.

సభవారు ఒకనిమిషం మౌనంగా ఉంటూ సానుభూతిప్రకటనం ఆమోదించారు.

తరువాత శ్రీమతి టి. సూర్యకుమారి "వైష్ణవజనతో" గీతాన్ని పాడారు.

## దక్షిణ రైల్వే ఆంధ్ర కళామండలి జోహార్లు

### చెన్నపురిలో స్మారకచిహ్నం ఏర్పాటుకు సూచన

మద్రాసు, మే 30: దక్షిణ రైల్వే ఆంధ్ర కళామండలి యాజమాన్యమున నిన్న బుధవారం సాయంత్రం ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులుగారి మృతికి సంతాపము ప్రకటించుటకు సానుభూతి సభ జరిగింది. సభకు డా॥ కె. వి. స్వామి అధ్యక్షత వహించారు.

"స్వరాజ్య" పత్రికా సంపాదకులు శ్రీ ఖాసా సుబ్బరావు ప్రసంగిస్తూ ప్రకాశంగారితో వారు స్వరాజ్య పత్రికలో పనిచేసిన ముఖ్యఘట్టాలను వివరించి "స్వరాజ్య" పత్రిక నాటి ప్రభుత్వానికి సింహస్వప్నంగా ఉండేదని అన్నారు. ప్రకాశంగారు అపరూపమైన మహావ్యక్తిఅనియు భయమంటే ఎట్టిదో ఎరుగని ధీరుడనియు జాతీయ వీరుడుగా ప్రజల ప్రేమాదరాలను ఆయన అపారంగా చురగొన్నారనియు చెప్పారు.

శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య ప్రకాశంగారి త్యాగమును దీక్షను మిక్కిలి కొనియాడి ప్రకాశంగారికి సరియైన స్మారకచిహ్నాన్ని ఏర్పాటు చేయవలసిందని సూచించారు.

శ్రీ జలంసుబ్రహ్మణ్యంనాయుడు శ్రీ నాగేంద్రన్ ప్రసంగిస్తూ ప్రకాశంగారు సైమన్ కమిషన్‌ను ఎదిరించి సత్యాగ్రహం చేసిన చోట నేవారికి స్మారకచిహ్నం నెలకొల్పాలని విజ్ఞప్తి చేశారు.

శ్రీ మందవరపు వెంకటేశ్వరరావు, ప్రకాశంగారిని గురించి రచించిన పద్యరత్నాలను చదివారు.

శ్రీయుతులు ఎస్. లక్ష్మీనారాయణ బి. సుబ్బనరసయ్య, బి. ఎల్. నరసింహారావు ప్రకాశం జీవితం వారి గుణగణాలను గురించి కొన్ని ముఖ్యవిషయాలను విశదీకరించారు.

అధ్యక్షుడు డా॥ కె. వి. స్వామి ఆంధ్రకేసరికి చెన్నపురిలో స్మారకచిహ్నంగా ఒక పురమందిరం గాని, విగ్రహంగాని ఏర్పాటు చేయటానికి అందరూ తోడ్పడాలని విజ్ఞప్తిచేశారు.

తరువాత మండలి అధ్యక్షులు శ్రీ ఎ. వేణుగోపాలరెడ్డి సానుభూతితీర్మానమును ప్రతిపాదించగా సభ్యులందరు రెండు నిమిషాలపాటు నిశ్శబ్దంగా నిలిచి ప్రకాశం ఆత్మశాంతికి ప్రార్థించారు.

శ్రీ ఆర్. శైలం వందన సమర్పణ చేస్తూ ప్రకాశంగారికి చెన్నపురిలో సరియైన స్మారక చిహ్నాన్ని ఏర్పాటు చేయటానికి మండలి సంపూర్ణ సహకారాన్ని ప్రకటించారు.

## ప్రజావసర సౌకర్యాలపై ప్రభుత్వ శ్రద్ధ

### స్థానిక పరిపాలనాశాఖమంత్రి హామీ

మహబూబాబాదు, మే 28: మంచి నీటి సరఫరా, విద్యుచ్ఛక్తివంటి ప్రజావసర సౌకర్యాలకు ప్రభుత్వం ప్రథమ ప్రాముఖ్యం ఇస్తుందని మహబూబాబాదు తెలంగాణా పంచాయతీ అధ్యక్షుల సభలో స్థానిక పరిపాలనశాఖ మంత్రి శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డి హామీ ఇచ్చారు.

తెలంగాణా జిల్లాలలో పర్యటిస్తూ మంత్రి నిన్న ఇక్కడికి వచ్చారు. స్థానిక కాంగ్రెసు నాయకులను మంత్రికి శాసనసభ్యుడు శ్రీ ఎస్. రామచంద్రారెడ్డి పరిచయం చేశారు. అభివృద్ధి పనులను జరిపించడంలో ఉద్యోగులతో సహకరించి రెండవ పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేయవలసినదిగా పంచాయతీ అధ్యక్షులను మంత్రి విజ్ఞప్తి చేశారు. విద్యుచ్ఛక్తి, మంచి నీటిసప్లయి వంటి ప్రజావసర సౌకర్యాలకు ప్రభుత్వం అధిక ప్రాముఖ్యం ఇస్తుందని మంత్రిహామీ ఇచ్చారు. సభకు శ్రీ కలవల గోపాలరావు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు ఎస్. రామచంద్రారెడ్డి, హయగ్రీవాచారి గారలు కూడా ప్రసంగించారు.

ప్రకాశం పంతులుగారి మృతికి సంతాప సూచకంగా సభ నిమిషంసేపు మౌనంగా నుంచున్నారు.

పట్టణ పురపాలక సంఘం మంత్రికి ఒక విజ్ఞప్తిని సమర్పించారు.

మున్నారు కాలువనుంచి మహబూబాబాదుకు మంచి నీరు సప్లయి చేయించే పథకానికి అధికప్రాముఖ్యం ఇవ్వవలసినది గానూ, మురికి నీటికాలవల నిర్మాణ పథకానికి డబ్బు ఇప్పించవలసినదిగానూ విజ్ఞప్తిలో పురపాలక సంఘం తరఫున మంత్రిని కోరారు.

ఇక్కడికి 6 మైళ్ళల్లో ఉన్న కెర్వి గ్రామంలో పశువుల సంతను నిన్న ఉదయం మంత్రి ప్రారంభించారు. ఇక మంచి ప్రతిసోమవారం ఆ గ్రామంలో పశువులసంత జరుగుతుంది.

## చౌక బియ్యం దుకాణాలు పెట్టాలి

### తూ. గో. జిల్లా ప్రజాసోషలిస్టుల విజ్ఞప్తి

రాజమండ్రి, మే 27:

తూర్పుగోదావరి జిల్లా ప్రజా సోషలిస్టుపార్టీ కార్యకర్తలు నిన్న శ్రీ జి. ఎస్. కృష్ణ అధ్యక్షతను సమావేశమైనారు.

రాష్ట్రశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ జి. సి. కొండయ్య ఎన్నికలు మొదలుకొని యీనాటివరకూ పార్టీ పరిస్థితి సమీక్షించి భావి కార్యక్రమం సూచిస్తూ ప్రసంగించారు. జిల్లాలో పార్టీ నిర్మాణం జరిపించేందుకు యీ క్రిందివారితో ఒక ఉపసంఘం ఎన్నుకున్నారు. శ్రీ కొలిత జనార్దనరావు, శ్రీ కర్రి పోచిరెడ్డి, శ్రీ ఆర్. వి. పెండ్యాల, శ్రీ నలమాటి వేణుగోపాలకృష్ణ, శ్రీ బీ శెట్టి కృష్ణమూర్తి, శ్రీ ఆకొండి మల్లిఖార్జున స్వామి శ్రీ బుద్ధవరపు సూర్యనారాయణమూర్తి.

ఆహారధాన్యాల ధరలు విపరీతంగా పెరిగిపోతున్నందువల్ల వెంటనే ప్రతి తాలూకా కేంద్రంలో ఒక చౌక బియ్యం దుకాణం ఏర్పాటుచేయించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

భారతప్రభుత్వం తలపెట్టిన అదనపు పన్నులు సామాన్యప్రజలకు అధికంగా చాల బాధకరంగా వుంటాయి. కనుక వాటిని ఉపసంహరించుకొని భారత ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ తీర్మానించారు. (స్వ. వి.)

## అభివృద్ధి పనులలో కడపజిల్లాకు ప్రథమ స్థానం

### ప్రభుత్వ ప్రశంస

కడప, మే 30: స్థానికాభివృద్ధి పనులను జరిపించడంలో రాష్ట్రంలో కల్లా కడపజిల్లాకు ప్రథమస్థానం వచ్చిందని జిల్లాకలెక్టరునూ, ప్రణాళికశాఖ ఉద్యోగులనూ ప్రభుత్వం ప్రశంసించింది.

స్థానికాభివృద్ధి పనులకు కేంద్ర ప్రభుత్వం సహాయంగా ఇచ్చిన రు2, 48, 132 కడపజిల్లా 1956-57లో వెచ్చించిందని ప్రణాళికశాఖ మంత్రికి సమర్పించిన నివేదికలో జిల్లాకలెక్టరు వివరించారు.

తిరుత్తని, మే 29: గ్రామోద్యోగుల వేతనాలను ఎక్కువ చేయటం సాధ్యం కాకపోతే ఉద్యోగంలోఉన్న వ్యాళ్ళ అనుభవంలో ఉండేసర్వీసు ఈనాము భూములను ఇవ్వవలసినదిగా ప్రభుత్వానికి తిరుత్తని, పుత్తూరు తాలూకాల గ్రామోద్యోగుల సభ విజ్ఞప్తి చేసింది. నిన్న ఇక్కడ జరిగిన ఈ సభకు శ్రీ పి. వి. సుందరవరదులు అధ్యక్షత వహించారు.

గ్రామోద్యోగుల వేతనాలను వీకొంచెం ఎక్కువ చేసినా ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో అనేక చిక్కులు వస్తవి కనుక, వంశాను గత వాక్కులను నిలబెట్టి గ్రామోద్యోగులకు ఉద్యోగ భృతిగా ఈనాము భూములను ఇచ్చే కొత్తపద్ధతిలో ఈ సమస్యను పరిష్కరించాలని శ్రీ సుందరవరదులు సూచించారు. డెప్యూటీ కలెక్టరు మేనేజరు శ్రీ పి. మల్లికార్జునం, శాసనసభ్యుడు శ్రీ పి. గోపాలరెడ్డి మొదలయిన పెద్దలూ, రెండు తాలూకాల గ్రామోద్యోగుల ప్రతినిధులూ సభకు వచ్చారు.

సభికులకు శ్రీ పి. చెంచురామానాయుడు స్వాగతం చెప్పారు.

గ్రామోద్యోగులకు ఉద్యోగభృతిగా ఇనాము భూములను ఇచ్చే పద్ధతివల్ల ఈసమస్య ఇందుకు సంబంధించిన వారందరికీ సంతృప్తికరంగా పరిష్కారమవుతుందని సభాధ్యక్షుడు వివరించారు.

శ్రీయుతులు పసల గోపాలరెడ్డి, దొరస్వామినాయుడు,సి. చిరంజీవులు, సుబ్రహ్మణ్యం పిళ్ళై, ఇ. దొరస్వామి, బూదూరు రామానుజులు రెడ్డి మొదలయినవారు ప్రసంగించారు.

కార్మికోద్యమ పద్ధతిలో సభ జరగనందుకు డెప్యూటీ కలెక్టరు మేనేజరు శ్రీ మల్లికార్జునం సంతోషం ప్రకటించారు.

గ్రామోద్యోగుల వేతనాలను ఎక్కువచేసే అవకాశం లేకపోతే, సర్వీసు ఈనాముభూముల పద్ధతిని పునరుద్ధరించవలసినదిగానూ, జమాబందిబత్తెమును కనీసం రు 25 ఇప్పించవలసినదిగానూ ప్రభుత్వాన్ని సభకోరింది. కమిషన్ ఇచ్చేపద్ధతిలో పంచాయతీ పన్నుల వసూలు పనికూడా గ్రామోద్యోగులకు ఇప్పించవలసినదిగాకోరారు. శ్రీ పి. చెంచురామానాయుడు వందన సమర్పణచేశారు.

## తాడేపల్లిగూడెం ఉన్నత పాఠశాల

### అభివృద్ధిచేసే కృషి

తాడేపల్లిగూడెం, మే 27: బోర్డు ఉన్నత పాఠశాలను అభివృద్ధిచేసే సంగతి ఆలోచించేందుకు పంచాయితీ అధ్యక్షుడు శ్రీ మెండు నరసింహారావు ఒక సభను ఏర్పాటు చేశారు. శాసనసభ్యుడు శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారంఅధ్యక్షతవహించారు. 6 తరగతులకు సరిపోయే పెద్ద పాకలను నిర్మించాలని, అందుకు సుమారు రు 8 వేలు కావాలనీ ప్రధానోపాధ్యాయుడు శ్రీ అల్లూరి వెంకటపతిరాజు వివరించారు.

పాఠశాల అభివృద్ధికి కృషిచేసేందుకు శ్రీ ఎస్. కె.వి. కృష్ణావతారం, పంచాయతీ అధ్యక్షుడు శ్రీ మెండు నరసింహారావు, ఎస్.వి.ఎస్. శర్మ గారలు సభ్యులుగా ఒక సంఘాన్ని నియమించారు.

## భీమవరంలో మశూచి

### 8 మంది మరణం

భీమవరం, మే 29: భీమవరంలో ఇంతవరకూ 28 మందికి మశూచి వ్యాధి వచ్చింది; 8 మంది మరణించారు. వ్యాధినిరోధక కృషి జరుగుతోంది. కొంత వరకూ వ్యాధి అదుపులోకి వచ్చిందని అనవచ్చు.

## భీమవరంలో ఉప్పుడు బియ్యానికి గిరాకీ

భీమవరం, మే 30: సరుకు రవాణా రైలు పెట్టెలు అంతగా సప్లయి కాకపోయినా మిల్లు యజమానులూ వారి ప్రతినిధులు ధాన్యానికి ఎక్కువ ధర ఇవ్వచూపుతున్నారు. ఇక్కడి ఉప్పుడు బియ్యానికి కేరళ, కలకత్తాలలో బాగా గిరాకీ ఉన్నదట. అవారం ఇక్కడ బియ్యం, ధాన్యంధరలు ఇట్లా ఉన్నవి:

ధాన్యం 166 పౌన్లుల బస్తా 1 కి అక్కుళ్ళు రు 27-0-0, కృష్ణకాటుకలు రు 28-0-0, దాళ్వా వడ్లు రు 28-5-0, గరికలు రు 25-0-0.

బియ్యం 164 పౌన్ల బస్తా 1 కి గోటంతోసహా అక్కుళ్ళు రు 42-0-0, కృష్ణకాటుకలు రు 45-0-0, సన్న కృష్ణకాటుకలు రు 48-0-0, బంగారు తీగలు రు 50-0-0, ఉప్పుడు బియ్యం గరికలు రు 40-0-0.

## దక్షిణ ఆఫ్రికాలో జాతి భేద విధానాలు

### ప్రభుత్వానికి బ్రిటన్ అమెరికాల మద్దత్తు

#### శ్రీమతి గుణం భావం

న్యూఢిల్లీ, మే 30: దక్షిణ ఆఫ్రికాలో జాతిభేద విధానం పేర సాగుతున్న భయంకర దమననీతినుంచి విముక్తిని పొందడానికి, ఆదేశంలోని రంగుజాతుల ప్రజలకు సహాయంచేయవలసిందిగా, దక్షిణ ఆఫ్రికా భారతీయ కాంగ్రెస్ ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె. గుణం నేడు, ప్రపంచంలోని, స్వతంత్రకాముక దేశాలన్నింటికి, విజ్ఞప్తి చేశారు.

### బ్రిటన్ అమెరికాల మద్దత్తు వుంది

భారత విదేశాంగ వ్యవహారాల పరిషత్తు ఆధ్వర్యంలో జరిగిన సభలో "దక్షిణ ఆఫ్రికాలో జాతి భేద విధానాలు" అన్న విషయాన్ని మాట్లాడుతూ "బ్రిటన్, అమెరికాలు గూడా ప్రపంచంలో ఎక్కడా, కని విని ఎరుగని, ఈ దమననీతి, స్వార్థంకోసం, బలపరుస్తున్నా"యని ఆవిడ విశదంచేశారు.

### ద॥ ఆఫ్రికా ప్రభుత్వం అక్రమాలు

ఉద్రేకంతో నిండిన వాక్కులతో శ్రీమతి గుణం, దక్షిణ ఆఫ్రికాలో శ్వేతేతరులు, శ్వేతజాతి జనం చేతుల్లో పడుతున్న బాధలను, గురి అవుతున్న అక్రమాలను వర్ణించారు. "ప్రపంచంలో ప్రజాస్వామ్య శిబిరాన్యం అయిన ఏ ప్రభుత్వమూ, ఇంతమంది జనానికి ఓటు లేకుండా చేసిన సందర్భం కనిపించదు. ఒక బండెడు పత్రాలు (ప్యాసులు) ఉంటే నేగాని, యే శ్వేతేతరుడు ఇల్లు కదిలేందుకు లేదు. పురపాలక సంఘాలు వారిని నగరాల్లో ప్రవేశించనియ్యవు. జాతిభేద శాసనాలు వారిని "ఉనికి కేరాలు" (రిజర్వులు) వదలి రానియ్యవు" అని ఆవిడ చెప్పారు.

### దేశ భక్తుల విచారణ

దక్షిణ ఆఫ్రికాలో ఇప్పుడు ప్రభుత్వము కొందరు దేశభక్తులను పట్టుకొని, దేశద్రోహం నేరంక్రింద సాగిస్తున్న విచారణనుగూర్చి మాట్లాడుతూ, ఆ దేశనాయకుల మీద ప్రభుత్వం బనాయించిన ఆరోపణలన్నీ, వట్టి కల్పనా కథలవంటి వనీ, ప్రపంచంలో సాగుతున్న "మహా అన్యాయకరమైన కృత్యాలలో" ఈ విచారణ ఒకటి అని ఆవిడ విశదం చేశారు.

దక్షిణఆఫ్రికా ప్రభుత్వాన్ని ఘోరరాక్షస స్వరూపంగా ఆవిడ వర్ణించారు

## అధికోత్పత్తికి జాతీయం చేయరాదు

### బడ్జెట్ చర్చలో మోతే వేదకుమారి సూచన

న్యూఢిల్లీ, మే 30: లోక్ సభలో నేడు బడ్జెట్‌పై తిరిగి చర్చ ప్రారంభమైనపుడు తేయాకు, పంచదార, కాఫీలపై పన్ను విధింపు తొలగించాలని శ్రీ అతుల్ విహారీ లాల్ బాయ్ కోరారు. ఆదాయపు పన్ను మినహాయింపు పరిమితిని తగ్గించినందుకు విమర్శించారు. నిత్యావసరవస్తువుల ఉత్పత్తి తగ్గిపోవడం, నిరోధించాలంటే పరిశ్రమల జాతీయం మార్గం కాదని శ్రీమతి మోతే వేదకుమారి చర్చసందర్భంలో అన్నారు. శ్రీ హుకాంసింగ్ యీ పన్నులవల్ల జీవనఖర్చు పెరిగిపోగలదని, పన్ను వసూళ్లకు వేరేపద్ధతి అనుసరించాలని చెప్పారు. బడ్జెట్‌ను బలపరుస్తూ ప్రభుత్వఖర్చులో దుబారా నివారించాలని శ్రీ పి. టి. శానుపి కోరారు. మద్యనిషేధం రద్దుచేసి ఉప్పు పన్ను తిరిగివిధించాలని శ్రీ కట్టిదత్తఅప్ప కోరారు.

శ్రీ కుమారన్ (కమ్యూ-కేరళ) యీ బడ్జెట్ ప్రజలపై ఎంతో బరువు వేసిందన్నారు. ఆదాయపు పన్ను మినహాయింపు పరిమితి తగ్గించే విషయమై పునః పరిశీలించాలని కాంగ్రెసు సభ్యుడు శ్రీ ఝుంఝున్‌వాలా కోరారు. భూసంస్కరణలు త్వరలో చేవాలని శ్రీ సురేంద్రనాథ ద్వివేది కోరారు.

నాగజాతివారి పట్ల ప్రభుత్వవిధానాలు మారాలని శ్రీ హసొవర్ జాన్సీ కోరారు. స్వపరిపాలనాధికారంగలనాగరాష్ట్రనిర్మాణానికి ప్రయత్నాలు చేయవలసిందిగా సూచించారు. సినిమాలపై వినోదపన్ను, విలాసాలపైపన్నులు పెంచడం మంచిదని, రైల్వే ఛార్జీలు, కార్డు ధరలు పెరగనివ్వరాదని శ్రీ భక్తదర్శన్ (కాం) విజ్ఞప్తి చేశారు.

## సరుకుల అధికోత్పత్తికి జాతీయం చేయనక్కర్లేదు

ఈ క్రొత్తపన్నుల మూలంగా నిత్యావసరవస్తువుల వుత్పత్తిపడిపోయి ద్రవ్యోల్బణం ఏర్పడే ప్రమాదం కలదని శ్రీ అంథోనిపిళ్లై హెచ్చరించారు. ఉత్పత్తి పెంపుదలకు, అధికోత్పత్తికి ఉత్సాహితులను చేయడానికి జాతీయం చేయడం మార్గంకాదని శ్రీమతి మోతే వేదకుమారి చెప్పారు. నిమ్నజాతుల వారిస్థితిగతుల అభివృద్ధికి ఎక్కువ సొమ్ము కేటాయించాలని శ్రీసాధూరాం కోరారు.

## కళాక్షేత్ర అడయారు మద్రాసు

శ్రీమతి రుక్మిణీదేవిగారి నిర్వహణకు

ఈ దిగువవారు సహాయకులుగా నియమితులైనారు

సంగీత శాస్త్ర విశారద, సంగీత కళానిధి మైసూరు కె. వాసుదేవాచార్య, ఉపాధ్యక్షులు. సంగీత కళానిధి కర్తుడి వీణ సాంబశివఅయ్యర్, ప్రిన్సిపాల్, శ్రీ చందు పణిక్కర్ మరియు ఇతర ప్రఖ్యాత విద్వాంసులు.

19-6-57 న మొదలు పెట్టబడు విద్యావిభాగములు.

సంగీతము: మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే స్వీకరించబడిన సంగీత శిరోమణి కోర్సు మరియు గాత్రము, వీణ, ఫిడేలు మృదంగములలో కళాక్షేత్ర డిప్లమా కోర్సులు.

పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులుకూడ కలవు.

నాట్యము: భరతనాట్యము, కథకళి, పెయింటింగు. క్రాఫ్టులు.

చదువు: మెట్రిక్యులేషను లేక తత్సమాన థియోసాఫికల్ హైస్కూలుకు, కళాక్షేత్ర కోర్సులకుకూడ సంబంధించిన హైస్కూలు విద్యలు.

భాషలు: తమిళము, తెలుగు, హిందీ, సంస్కృతము, ఇంగ్లీషు.

హోస్టల్: బాలురకు, బాలికలకు, పిల్లలకు విడివిడిగా కలదు. వ్యక్తిగతము గా సంప్రదింపుజరిపినమీదటనే ప్రవేశము.

కార్యదర్శికి 8 అణాల (50 నయాపైసలు) పోస్టలు ఆర్డరుతో దరఖాస్తు పంపినచో, ప్రాస్పెక్టసు పంపబడును.

